Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

పైననిలబడి చూసేదంత

పంపినవారు:
యస్. బాషుమియ - కర్నూలు

Despatched on 31.1.1961



ధనము పొదుపు కొరకు

# "ఉమా"

22. క్యారట్లు బంగారు రేకు కవరింగు నగలనే కొనండి.

అనేక సంవత్సరములు మన్నికగా యుండును.



















బొత్తములు రు. 1/- కఫ్సు-బొత్తములు రు. 2/-
జత గాజులు— 2½ సైజు నం. 203 - జత రు. 14/40;
నం. 705/2 జింకీ - జత రు. 6/-;
నం. 37 ఉంగరాలు జత రు. 2/-.

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

H.O. ఉమా మహల్ .. మచిలీపట్టణము. ఇండియా

ప్రొప్రయిటర్: టి. వి. సుబ్బయ్య

మా విక్రయ శాలలు:

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు-1

శివాలయం వీధి, విజయవాడ

104, కామధేను బిల్డింగు, ఎవెన్యూ రోడ్డు, బెంగుళూరు సిటి

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# పాఠకుల లేఖలు

## ఫిబ్రవరి 1961

చల్లని వెన్నెల సరుకు రవాణాను
సలుపజాలిన మేల్మి చందమామ!
పసి కుఙ్జలకు శుక్లపక్ష ప్రభావమ్ము
ప్రోదిచేసినయట్టి బుల్లి మామ!
తారావధూటుల సారకస్తురి తావి
కొల్లగొట్టినయట్టి కొంటెమామ!
విశ్వ సౌందర్యంపు వెన్నముద్దలు చిల్కి
చిట్టిపాపల కిచ్చునట్టి మామ!
పసిడిరంగుల బొమ్మల పసలు చూపి
ముగ్ధలందర మురిపించు ముద్దుమామ!
తెలుగుదేశపు వాడ వాడలకు వెలుగు
"చక్రపాణి"కి మణిది మా "చందమామ"!

—బాచిమంచి శ్రీహరిశాస్త్రి, బాచిమంచివారి అగ్రహారం

"పాఠకుల లేఖలు" ప్రారంభించినందుకు చాల సంతసించుచున్నాను. "కొయ్య గుర్రము" చాల బాగుంది.

—టి. జయప్రకాశ్, నిజామాబాద్

"శమంతకమణి" చదువుతూ యున్నంతసేపు ఎంతో ఆనందముగ యున్నది. రచయితకు అభినందనలు.

—జొన్నలగడ్డ ద్వారకనాథ్, బి.ఏ., తిరుపతి

శ్రీ వడ్డాది పాపయ్యగారి అట్టమీది బొమ్మ నూతన కాంతులను వెదజల్లుతూ, "చందమామ"ను ప్రకాశింప జేసినది.

—ఏ. మోహన్ మనోహర్, గుంతకల్

"నగారా తీర్పు", "మూడు వరాలు" చాలా బాగున్నవి. "కొయ్యగుర్రం" ప్రచురించిన ఎడిటర్ గారికి నా అభివందనములు.

—ఎం. శ్రీనివాసరావు, తాడేపల్లిగూడెం

"శమంతకమణి" చదువుతున్నంతసేపు పిల్లలకు ఆనందమును కలిగించుచున్నది.

—కొప్పర్తి రమణయ్య, వావిళ్ళ

అద్భుత సంఘటనలు, అడుగడుక్కి ఆశ్చర్యం కలిగించే దృశ్యాలు, చదివేకొద్దీ ఇంకా చదవాలని పించే కథాసంవిధానం.... ఇంకా.... ఇంకా.... నీ "జ్వాలాద్వీపాన్ని" గురించి చెప్పలేననుకో!

—సయ్యద్ అబ్దుల్ మునాఫ్, మిడుత్తూరు.

"కొయ్యగుఱ్ఱం" బాగుంది. శ్రీ వడ్డాది పాపయ్యగారు చిత్రించిన చిత్రము చాలా బాగుంది. ప్రతిసారి ప్రచురిస్తారని తలుస్తాను.

—వి. శ్రీనివాసరావు, మద్రాసు

తాతయ్య చెప్పే కథలు చాలా బాగుండి మమ్మల్ని ఆనందపరుస్తున్నవి.

—వి. ఆర్. శేఖర్, చేబ్రోలు

వడ్డాది పాపయ్యగారు వేసిన వాష్ డ్రాయింగ్ చిత్రములు నన్నెంతో ఆకర్షించినవి.

—జె. ఎస్. ప్రసాద్, విశాఖపట్నం

"శకుంతల"కు (బొమ్మలు) చిత్రించిన శ్రీ వడ్డాది పాపయ్యగారికి నా ధన్యవాదాలు.

—పింగళి ఆదినారాయణమూర్తి, అలంపూరు

ఇకమీద ప్రతి నెల అట్టమీది బొమ్మ వ. పా. వేస్తే బాగుంటుందని మా అభిప్రాయం. "చందమామ"కు నూతన సంవత్సర శుభాకాంక్షలు.

—పెదగాడ సాంబశివరావు, పూడూరు

నీకు హాస్యంగా మాట్లాడటం వచ్చునని జనవరి జవాబుల్లో తెలిసింది. నీ వెంత మంచివాడవయినా, బొమ్మల కథ క్రొత్తది ప్రారంభించనందుకు నాకు కోపం వచ్చింది.

—బి. రామకృష్ణ, ఏలూరు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈనెల నాటక కథ "మాలతీ మాధవం" భవభూతి రచనకు సంబంధించినది. సంస్కృత నాటక కర్తలలోనూ కవులలోనూ భవభూతి గొప్ప ఖ్యాతి సంపాదించుకున్నవాడు. ఈయన రచించిన "ఉత్తర రామ చరిత" చాలా ప్రసిద్ధమైనది.

"పాఠకుల లేఖలు" అన్న కొత్త శీర్షికను "చందమామ" పాఠకులు తమ విమర్శలను అందజేయటానికీ, తమ అభిరుచులను వ్యక్తం చెయ్యటానికీ వీలయినంత బాగా ఉపయోగపరుచుకోవాలని కోరుతున్నాం. ఈ శీర్షికకు లేఖలు పంపేవారు "పాఠకుల లేఖలు" అన్న శీర్షిక పేరును తమ ఉత్తరాలలో స్పష్టంగా రాయటం మంచిది. ఒక లేఖలోనే ప్రశ్నలూ, ఫోటో వ్యాఖ్యలూ, అభిప్రాయాలూ రాసి పంపవద్దు.

సంపుటి 28 : ఫిబ్రవరి 1961 : సంచిక 2





# కుమణుడి ఔదార్యం

ఒకప్పుడు కుమణుడనే రాజు దాతృత్వానికి ప్రసిద్ధికన్నాడు. ఎవరు వచ్చి "దేహి" అన్నప్పటికీ ఆయన "లేదు" అని ఎరగడు.

రాజుగారు చేసే ఈ దాన ధర్మాలు మంత్రులకు ఏమాత్రమూ నచ్చలేవు. అందుచేత వారు ఎలాగైనా రాజుగారికి ఉద్వాసన చెప్పాలని నిశ్చయించుకున్నారు.

కుమణమహారాజుకొక తమ్ముడు ఉన్నాడు. అతనికి అన్నపై ఈర్ష్య. అందుచేత అతనికి మంత్రులు సహాయం చేసి రాజుపై తిరుగుబాటు చేయించారు. తమ్ముడు విజయవంతుడై, అన్నను అరణ్యాలకు పారదోలి తానే రాజయాడు.

కుమణుడు అన్నవస్త్రాలకు కూడా కరువై అరణ్యవాసం సాగించాడు. అయినా ఎవరైనా వస్తే తనకున్నదానిలోనే వారికికూడా పెడుతూ, తన ఔదార్యానికి భంగం కలగకుండా చూసుకుంటున్నాడు.

మంత్రులు రాజునైతే మార్చారుగాని ప్రజల హృదయాలను మార్చలేకపోయారు. ప్రజలింకా ఆ మహారాజునే తలుచుకుంటున్నారు. కొత్తరాజు పట్ల వారికి కొంచెం కూడా ఆదరం లేదు. ఇది చూసి మంత్రులు కుమణమహారాజును నిర్మూలించాలని నిశ్చయించారు. ఎవరైనా కుమణుడి తల తెచ్చినట్టయితే వారికి లక్ష రూపాయలిస్తామని వారు దేశమంతటా చాటింపు వేయించారు.

ఇదంతా జరిగిన కొద్దిరోజులకే ఒక కవి పొరుగు దేశంనుంచి కుమణమహారాజు దర్శనం చేసుకుని, సత్కారం పొందుదామని బయలుదేరి అరణ్యమార్గాన వస్తుండగా ఒక చెట్టుకింద కుమణుడు కనిపించాడు.

కవి రాజును గుర్తుపట్టి, అభివాదనం చేసి, తాను వస్తున్న పని చెప్పాడు.

కుమణుడు కుంగిపోయి, "అయ్యో, మహాకవీ! నేనిప్పుడు రాజ్యభ్రష్టుణ్ణి.

బి. ఆనందరావు

నా తమ్ముడే నాకు ద్రోహంచేసి నన్ను అడవులపాలు చేశాడు. ఈ స్థితిలో నేను నీకేమి ఇవ్వగలను? అయినా నీకు డబ్బు లభించే పద్ధతి చెబుతాను. నా తల తెచ్చినవారికి నా తమ్ముడు లక్ష రూపాయలిస్తానని చాటింపు వేశాడట. ఇదుగో నా కత్తి. దీనితో నా తల నరికి తీసుకుపోయి బహుమానం పుచ్చుకో!" అన్నాడు.

ఈ మాటలు విని కవి కంట కన్నీరు ప్రవహించింది. కుముణమహారాజు దాతృత్వం ఎంతదాకా వెళ్ళిందో, ఆయన ఎంతటి ఉదార స్వభావుడో కవికి తెలిసి వచ్చింది. అతను కుముణుడితో, "మహారాజా, మీ తల ఉండనివ్వండి. నేను లక్ష రూపాయలూ మీ తమ్ముడివద్ద పుచ్చుకోవటమే గాక, సాధ్యమైతే మీ రాజ్యంకూడా మీకు దక్కేలాగు చేస్తాను. ప్రస్తుతం నాకు సెలవిప్పించండి" అన్నాడు.

తరవాత ఆ కవి ఒక అరటిదుంపను కుముణుడి తలలాగా తయారుచేశాడు. దానికి తగిన విధంగా రంగులు వేసి, ప్రతి ఒక్కరూ అది కుముణుడి తలేనని భ్రమపడేలాగ సిద్ధంచేశాడు. తరవాత దాన్ని తీసుకుని కుముణుడి తమ్ముడి వద్దకు వెళ్లి, "మహారాజా, నేనొక కవిని. కుముణ



మహారాజు కవులను సత్కరించేవాడు. నేను పేదవాణ్ణి కావటంచేత ఆ మహారాజు సహాయంతో నా దారిద్ర్యం తీర్చుకుందామనుకుని దూరదేశం నుంచి వచ్చాను. కుముణ మహారాజు అడవుల పాలయాడనీ, ఇప్పుడు ఈ దేశంలో కవులకు సత్కారం జరగటం లేదనీ విన్నాను. మీ అన్నగారు నాకు అడవిలో కనిపించి, తన తల తీసుకువచ్చినట్టయితే తమరు లక్షరూపాయలిస్తారని చెప్పారు. దానకర్ణుడనే పే. ఆయనకే చెల్లింది. ఇదుగో ఆయనతల తెచ్చాను. మీరిచ్చే బహుమానం ఇప్పించినట్టయితే నా దారిన నేను పోతాను," అంటూ కవి

మూట విప్పి తాను తయారుచేసిన మాయ తల చూపాడు.

అంతవరదాకా మంత్రులు ఏమి చెబితే అది చేస్తూవచ్చిన తమ్ముడు అన్న తల చూసి, ఆయన దాతృత్వం గురించి కవి అన్న మాటలు వినగానే గుండె చెదిరి బావురుమని ఏడవ నారంభించాడు.

"రాజా, చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏంలాభం? అంతా మించిపోయాక యిప్పుడు ఏడిస్తే మీ అన్న తిరిగి వస్తాడా?" అన్నాడు కవి.

"నాకీ రాజ్యం అక్కర్లేదు. నేను మంత్రుల చేతిలో కీలుబొమ్మనై, ప్రజలందరిచేత శాపనార్థాలు పడటమే గాక, దేవుడులాటి అన్నను పోగొట్టుకున్నాను," అన్నాడు తమ్ముడు.

"మీ అన్నగారిని తిరిగి బతికిస్తే ఆయనకు రాజ్యం అప్పగిస్తావా?" అని అడిగాడు కవి.

"తప్పక ఇస్తాను. మీకు చేతనైతే మా అన్నను బతికించండి," అని తమ్ముడు కవి కాళ్ళపైన పడ్డాడు.

"అయితే నా వెంట అరణ్యానికి రా! మీ అన్నను బతికిస్తాను!" అంటూ కవి కుసుమబుడి తమ్ముణ్ణి వెంటపెట్టుకుని, కుసుమబుడు ఉంటున్న చోటికి తీసుకుపోయాడు.

కుసుమబుణ్ణి ప్రాణాలతో చూడగానే తమ్ముడికి ఆనందమూ, పశ్చాత్తాపమూ పొంగి పొర్లింది. అతను అన్న కాళ్ళపైన పడి క్షమాపణ వేడాడు. చచ్చిపోయిన తన అన్న తిరిగి ఎలా బతికాడో అదిమాత్రం అతనికి అర్థంకాలేదు.

కవి తాను చేసిన యుక్తి కాస్తా బయటపెట్టాడు. తరవాత కుసుమబుడూ, ఆయన తమ్ముడూ, కవీ రాజధానికి తిరిగి వచ్చారు. కుసుమబుడు తిరిగి రాజయాడు. కుట్ర చేసిన మంత్రులకు శిక్షలు పడ్డాయి. కవికి గొప్పగా సన్మాన సత్కారాలు జరిగాయి.





# శమంతకమణి

ద్వితీయాశ్వాసము [తరువాయి]

భగభగమని మండుచున్న
భాస్కరు కిరణాలు తనదు
కనుల దెఱవ నీకుండిన
కాంచలేక సత్రాజితు—

"ఇంత వెలుగు చూడలేవు
ఈ కన్నులు మూతపడెను
కన్నులార నిన్నెట్టులు
కాంచగలను సూర్యదేవ!"

అనిన నగుచు సూర్యుడపుడు
తన కంఠమునం దుండిన
దివ్యంబగు రత్నమొకటి
తీసియిచ్చి ఇట్లు పలికె:

"ఈ శమంతకమును నీవు
ఇంపుతోడ ధరియింపుము
దీని వలన నా రూపము
తేఱి చూడ రాకున్నది."

అరుణు డిట్లు తెలియజెప్పి
వర మొక్కటి వేడుమనెను;
'ఇంకొక వరమేల దేవ!
ఈ రత్నమె చాలు నాకు'

అనిన మెచ్చి సూర్యదేవు
డా రత్నపు మహిమ చెప్పి
ఏడు గుఱ్ఱముల రథమ్ము
నెక్కి మింటికెగసి పోయె.

సత్రాజితు సంబరమున
శమంతకము దాల్చి నేడు
ద్వారక కరుదెంచుచుండె
ధగధగమని మెఱయుచుండె!

ఆ రత్నపు శోభలతో
అత డట్లు వెలుగొందెడు
అంతెకాని సూర్యు డింద్రు
డగ్నిదేవు డతడు కాదు."

ఉత్పల సత్యనారాయణాచార్య

అని కృష్ణుడు చెప్పుచుండ
అచ్చటికే సత్రాజితు
అరుగుదెంచి శ్రీకృష్ణున
కభివందన మాచరించి—
"సూర్యుడు నా కొసగినాడు
చూడు మీ శమంతకమును
ఇంత విలువ గల రత్నము
ఇంతకు ముందెపుడు లేదు.

ప్రతిదిన మిది పుట్లకొలది
బంగారము పెట్టుచుండు
ఇది యుండిన దేశమందు
ఎట్టి కీళ్ళు రాకుండును."
అని చెప్పిన విని కృష్ణుడు
ఆ రత్నము ఉగ్రసేన
మహారాజునకు నిచ్చిన
మర్యాదగ నుండు ననెను.



ఆ మాటలు సత్రాజితు
కేమాత్రము నచ్చలేదు
బదులేమియు పలుకకుండ
బయలుదేరినా డింటికి.

జ్యోతిషికులు చెప్పినట్టి
శుభ ముహూర్తమందు మణికి
పూజ చేసి దాని నొక్క
భోషాణమునం దుంచెను.

తేపతేప భోషాణము
తెఱచి చూచుచుండు నతడు
దానిపైన తా పరుండి
తలపోసెను ఇట్టులతడు :

"ప్రతి దినమ్ము ఏడెనిమిది
బంగారపు పుట్లు పెట్టు
రత్నమ్మిది ఊరకెట్లు
రాజున కర్పించువాడ?

అంత గొప్ప కృష్ణుండును
అడిగినాడు ఈ రత్నము
ఇయ్యకున్న బాగుండదు
ఎట్లు దీని నియ్యగలను?

చిన్ననాటి నుండి కూడ
శ్రీకృష్ణుడు చిలిపివాడు
ఈ శమంతకమ్ము నతడు
ఎన్న డెత్తుకొని పోవునో!



మణి దొరకిన సంతోషము
మనసున ఒక్కింత లేదు
గోవిందుని కంటబడిన
ఏ వస్తువు దక్కబోదు.

చీచీ యీ రత్నమ్మును
దాచలేక పోచుంటిని
పెండ్లివయసు కన్య నింట
పెట్టుకొనిన లాగుండెను!

నా కూతురు సత్యభామ
నవలావణ్యమునకు సీమ
గోవిందుని కామెపైని
కోరిక కలదని విందును.

సత్యభామ నేమైనను
శతధన్వున కిచ్చి చేతు—
ప్రాణపదంబైన మణిని
ప్రసేనునకు ఇచ్చివైతు."

అని తలంచి సత్రాజితు
తన తమ్ముని దరికి పిలిచి
ఓ ప్రసేన! ఈ రత్నము
ఉంచుకొనుము నీ దగ్గఱ.

ఇది పెట్టిన బంగారము
పదిలముగా అప్పగించి
నా కవసరమైనప్పుడు
నాణ్యము చెడకుండ నిమ్ము.

అని పలికి యొసంగినట్టి
ఆ రత్నము గొని యాతడు
సంతసమున మిన్నందెను
చక్కగ ధరియించుకొనెను.

శుచి శుభ్రము లేనివాడు
సొగసున కా మణి దాల్చిన
పసిడి మూట దేవుడెఱుగు
ప్రాణాపద కలిగించును. —(సశేషం)






## 14

[చిత్రసేనుడు తను వాగ్దానం చేసిన ప్రకారం ఉగ్రాక్షుడికి తన ప్రథమ సంతానాన్ని యివ్వకుండా, ఇతర్ల పిల్లల్ని యిచ్చాడు. ఉగ్రాక్షుడు ఈ మోసం గ్రహించాడు. చివరకు చిత్రసేనుడు తన పిల్లవాణ్ణి ఉగ్రాక్షుడి పరం చేశాడు. ఉగ్రాక్షుడు ఆ పిల్ల వాడికి ఉగ్రదత్తుడని పేరుపెట్టి, మరిద్దరు కుర్రవాళ్ళతో, అతణ్ణి తన కోటలో పెంచసాగాడు. తరవాత—]

ఐదేళ్ళ వయసు వరకూ, రాజభోగాలతో సుకుమారంగా పెరిగిన చిత్రసేనుడి కుమారుడు, రాక్షసుడైన ఉగ్రాక్షుడి కోటలో ఉగ్రదత్తుడనే పేరుతో పెరగసాగాడు. అతడికి తోడుగా వుంటూ ఆటపాటల్లో పాల్గొనేందుకు దొంగిలించుకురాబడిన పల్లెబాలురకు, ఉగ్రాక్షుడు రుద్రుడు అనుద్రుడు అని పేర్లు పెట్టాడు. ఈ ముగ్గురూ రాక్షసుల నడుమ తతిమ్మా రాక్షస బాలురతోపాటు పెరిగి పెద్దవారవుతున్నారు.

రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతున్నై. చూస్తూండగానే పదిహేను సంవత్సరాలు గిర్రున తిరిగినై. ఉగ్రాక్షుడు తన నాయకత్వంకింద వున్న రాక్షసులను హింసాప్రవృత్తి మాన్పి నాగరికులను చేసేందుకు, వాళ్ళచేత అడవి నరికించి వ్యవసాయపు పనులు చేయించసాగాడు. కాని, వాళ్ళకు భూములు దున్నేందుకూ, పండిన పంటలను ఇళ్ళకు చేర్చేందుకూ మామూలు ఎడ్లూ, దున్నపోతులూ పనికి



రాలేదు. మహాకాయులూ, బలశాలులూ అయినవాళ్ళ చేతుల్లో, మనుషులు ఉపయోగించే ఈ పశువులు ఎందుకూ అక్కరకు రాకుండా పోయినై. ఆ కారణంచేత వాళ్ళు ఏనుగులనూ, ఒంటెలనూ, ఖడ్గమృగాలనూ నాగళ్ళకూ, బండ్లకూ కట్టి వ్యవసాయపు పనులు చేయసాగారు. ఇది అడవిలో వున్న గ్రామాల్లో నివసించే ప్రజలకు ఎంతో ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. రాక్షసులు నరమాంస భక్షణా, గ్రామాలమీద పడి పశువులను దొంగిలించుకుపోవటం మాని, ఈవిధంగా వ్యవసాయదారులైనందుకు వాళ్లెంతగానో సంతోషించారు. ఈ అన్ని



కారణాలవల్లా చిత్రసేనుడు పాలిస్తున్న కపిలపురరాజ్యం సర్వసంపదలతో తులతూగ సాగింది.

ఇప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి చెలికాళ్లయిన రుద్రారుద్రులూ ఇరవై ఏళ్లు నిండిన నవయువ్వనులు. వాళ్లు కత్తిసామూ, గుర్రపుస్వారీ, ఈటె విసరటం, ధనుర్బాణాలు ప్రయోగించటంలో గొప్ప నిపుణులైయ్యారు. వాళ్లు ఉగ్రాక్షుడి ద్వారా ఒకప్పుడు కపిలపుర రాజ్యంలో పెద్ద సంక్షోభం కలిగించిన, జ్వాలాద్వీపపు పులిరాయుళ్లను గురించి విన్నారు.

"ఈనాటికీ ఆ పులిరాయుళ్లు భయంకర పక్షులమీద ఎక్కి, అప్పుడప్పుడూ రాత్రి వేళల మన రాజ్యంలో కనిపిస్తూవుంటారు. గత పదిహేను సంవత్సరాలుగా వాళ్లు రాజ్యంలో చేసిన దుండగం ఏమీలేదు. వాళ్ల నాయకుడుగా యిక్కడికి వచ్చిన కరవీరుడూ, ద్రోహి నాగవర్మా మనకు చిక్కకుండా పారిపోయారు," అని చెప్పాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడి ఈ మాటలూ, హెచ్చరికా ఉగ్రదత్తుడి మనసులో బాగా హత్తుకుపోయినై. ద్రోహి నాగవర్మా, అతడి అనుచరుడు కరవీరుడూ జ్వాలాద్వీపంలో





వున్నారో లేదో అన్న సంగతి యిదమిత్థంగా తెలుసుకుంటే తప్ప, రాజ్యానికి క్షేమం లేదని అతడు నిర్ణయించుకున్నాడు. ఈ నాటికీ రాజ్యంలో జ్వాలాద్వీపవాసులు అప్పు డప్పుడూ కనిపిస్తూ వున్నారంటే—దాని అర్థం ఆ క్రూరులు ఈ కపిలపుర రాజ్యాన్ని గురించి పూర్తిగా మరిచిపోలేదన్నమాట.

ఉగ్రదత్తుడు తన స్నేహితులైన రుద్రా రుద్రులతో సంప్రదించి ఒక పథకం వేశాడు. అదేమిటంటే, రాజ్యంలో రాత్రివేళల చెదురుగా అక్కడా యిక్కడా కనబడే జ్వాలాద్వీపవాసుల్లో ఒకణ్ణి ప్రాణాలతో పట్టు కోవటం. అలా ఒకడు దొరికినన్నాడు వాడి ద్వారా ప్రస్తుత జ్వాలాద్వీపపు స్థితిగతులు తెలుసుకోవచ్చు. ద్రోహి నాగవర్మా, కర వీరుడూ సజీవులో కాదో గ్రహించవచ్చు.

ప్రాణాలతో ఒక జ్వాలాద్వీపపు పులి రాయుణ్ణి పట్టుకోవాలంటే, అరణ్యంలో వున్న ప్రజలూ, రాక్షసులూ సహకరించాలి. ఏదైనా పెద్ద బహుమానం ప్రకటిస్తే వాళ్లు అన్నిటికీ తెగించి, రేబవలు కాపలా వేసి, ఒక్క పులిరాయుణ్ణయినా తప్పక పట్టుకు తీరుతారు.

ఉగ్రదత్తుడు ఈవిషయం తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడితో మాట్లాడాడు. ఉగ్రాక్షుడు వెంటనే అంగీకరించాడు. "పులి రాయుణ్ణి ప్రాణాలతో పట్టి తెచ్చినవాళ్ళకు ఒక లక్ష బంగారు కాసులు యిస్తామని చాటింపు వేయించు. పోయిందేమిటి? మన కోటలోని నేల మాళిగలలో బంగారం మూలుగుతున్నది," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రదత్తుడు అడవిలోని జనవాసాల్లో రాక్షసులు నివసించే కొండ చెరియల్లో చాటింపు వేయించాడు. అది మొదలు రోజూ జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళను గురించిన సమాచారం ఉగ్రాక్షుడి కోటకు తెలియు వస్తూండేది. పులిరాయుళ్లు తమ భయంకర పక్షులమీద ఎక్కి రాత్రివేళ చాలాచాలా





ప్రదేశాల్లో కనిపిస్తున్నారు. కాని, ఎక్కడా వాళ్లు కిందికి దిగటంలేదు.

ఈరకమైన వార్తలు ఉగ్రదత్తుణ్ణి నిరుత్సాహ పరిచినై. పులిరాయుళ్లు రాజ్యంలో ఎలాంటి కల్లోలం కలిగించాలనే ప్రయత్నంలో, ఈవిధంగా రాత్రివేళల వేగు వస్తున్నారో అతడికి అర్ధంకాలేదు. ఒకవేళ ఆ క్రూరులు ప్రజల కంటబడకుండా, ఏ మారుమూలనున్న అడవి ప్రాంతాల్లోనైనా కిందికి దిగుతున్నారా?

ఈ అనుమానం తీరాలంటే తనే స్వయంగా రాత్రివేళల్లో అడవిలోకి పోయి, ఏదో ఒక ఎత్తయిన ప్రదేశాన్నుంచి కాపలా



కాయాలి. ఉగ్రదత్తుడు యీ నిర్ణయానికి రాగానే, రుద్రుడూ అరుద్రుడూ కూడా అతడి వెంట వచ్చేందుకు ఉత్సాహం కనబరిచారు. ఒకనాటి సూర్యోదయం వేళ ముగ్గురూ కోట వదిలి గుర్రాలమీద అరణ్యంలోకి బయలుదేరారు. వాళ్లు జనులు నివసించే గ్రామాలను వదిలి, నిర్జనంగా వుండే అరణ్య ప్రాంతాల వెంట నడిరేయివరకూ ప్రయాణం చేశారు.

ఆసరికి ముగ్గురూ అలసిపోయారు. గుర్రాలు బాగా డస్సిపోయి వున్నాయి. తెల్లవారేవరకూ అక్కడ వున్న ఒక దేవదారు వృక్షం కింద విశ్రాంతి తీసుకోవాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. ముగ్గురూ గుర్రాలు దిగి, వాటిని విడివిడిగా చెట్లకు కట్టివేసి, తాము పడుకోదలుచుకున్న చెట్టుకిందికి వచ్చేసరికి, చెట్టు పైభాగమంతా వెలుగుతో మెరిసిపోవటం వాళ్ళ కంటబడింది.

అందరికన్న ముందు తలఎత్తి చూసిన ఉగ్రదత్తుడు, ఎక్కడలేని ఆశ్చర్యంతో, "భయంకర పక్షి! దానిమీద వున్న పులిరాయుడి చేతిలో వెలుగు నిస్తున్న వస్తువేదో వున్నది," అన్నాడు.

రుద్రారుద్రులుకూడా తలలు ఎత్తి చూశారు. ఆ సరికి భయంకర పక్షి పడమటి



రుద్రారుద్రులు కూడా తలలు ఎత్తి చూశారు. అసరికి భయంకరపక్షి పడమటి దిశగా చాలా దూరం వెళ్ళిపోయింది. వాళ్ళు కూడా పక్షి పోతున్న వైపు నుంచి వెలుగు రావటం గమనించారు.

"నేను ఈ దేవదారు చెట్టు చిటారు కొమ్మకు ఎక్కి, మనం ప్రస్తుతం ఎలాంటి పరిసరాల్లో వున్నామో చూస్తాను." అన్నాడు రుద్రుడు.

ఇందుకు ఉగ్రదత్తుడూ, అరుద్రుడూ సరేనన్నట్టు తలలు వూపారు.

రుద్రుడు దేవదారు చెట్టు పైకి గబగబా పాకిపోయి, కొద్దిసేపటికల్లా వగరుస్తూ కిందికి దిగి వచ్చాడు.

ఉగ్రదత్తుడు ప్రశ్నించే లోపలే రుద్రుడు పడమటి దిక్కు కేసి చెయి వూపుతూ, "ఇక్కడికి దాపులనే ఎవరిదో పెద్ద కోట వున్నది. కోటలో ఎక్కడా వెలుగు లేదు. బురుజుల మీద ఎవరూ కాపలా వున్న సూచనలు కూడా కనబడటం లేదు." అన్నాడు.

రుద్రుడి మాటల్లోని ఆదుర్దా గమనించిన ఉగ్రదత్తుడు, "అయితే, నీ అభిప్రాయం, పులిరాయుళ్ళు ఆ కోటలో ఏమైనా దిగి వుంటారనా?" అని అడిగాడు.

"ఆ సంగతి తేల్చి చెప్పటం కష్టం. ఆ కోటలో వుంటున్న వాళ్ళెవరైనా—




వాళ్ళు ఏమాత్రం జాగ్రత లేకుండా వుంటున్నారన్నదే నా వుద్దేశం. ఇంతకు ముందు మనం చూసిన పులిరాయుడు, ఆ కోటలోగాని దాని పరిసరాల్లోగాని దిగి వుంటే, చూసి హెచ్చరిక చేసే నాథుడెవడూ వున్నట్టు లేదు," అన్నాడు రుద్రుడు.

రుద్రుడికి కలిగిన సంశయం లాంటిదే ఉగ్రదత్తుడి క్కూడా కలిగింది. తన కోట రక్షణను గురించి యింత నిర్లక్ష్యంగా వుంటున్న, ఈ కపిలపురం సామంతుడెవడా అని అతడు కొంచెంసేపు ఆలోచించాడు. తెల్లవారితేగాని, ఈ ప్రశ్నకు జవాబు దొరకదు. సూర్యోదయంతోపాటే లేచి,



ఇప్పుడు అరణ్యమంతా తెల్లని వెలుగుతో నిండిపోయివుంది. ఆకాశాన్నంటుతూన్న పెద్ద పెద్ద మానులూ, వాటి నుంచి వేలాడుతున్న పొడుగాటి ఊడలూ, వాటిని ఆధారం చేసుకుని ఒక చెట్టు మీది నుంచి మరొక చెట్టు మీదికి ఉరుకుతూన్న కోతులూ, రంగురంగుల పక్షులూ — అంతా ఎంతో మనోహరంగా వున్నది.

"ఈ ప్రాంతం మనం వుండే అరణ్య ప్రాంతంకన్న ఎంతో అందంగా వున్నది," అన్నాడు ఉగ్రదత్తుడు.

"అందుకనే, ఈ సామంతరాజెవరో యిక్కడ కోట కట్టుకుని వుంటాడు. పులిరాయుళ్ళకు కూడా ఈ మారుమూలనున్న అరణ్యప్రాంతం మరెవరి కంటా పడకుండా దాక్కోవటం కష్టం కాదు," అన్నాడు రుద్రుడు.

పులిరాయుళ్ళ పేరు వింటూనే ఉగ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. అతడితోపాటు స్నేహితులిద్దరూ కూడా లేచి నిలబడి, "కోటకేనా ప్రయాణం? గుర్రాన్ని తెమ్మంటావా?" అని అడిగారు.

"గుర్రా లెందుకు! కోట సుమారుగా ఎంత దూరంలో వుంటుంది?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"పావుకోసెడు దూరం కూడా వుండదని నా నమ్మకం. అయినా, నేను చీకట్లో

తాను మొట్టమొదటగా చేయవలసిన పని ఈ సామంతరాజుకు, పులిరాయుళ్ల నుంచి రాబోయే ప్రమాదాన్ని గురించి చెప్పి, హెచ్చరించటం.

తరవాత కొద్ది సేపటికల్లా ప్రయాణ బడలికతో నీరసించి వున్న ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ చెట్టు కింద ఒళ్ళు మరిచి నిద్రపోయారు. సూర్యోదయం కాగానే అడవిలో జంతువులూ, పక్షులూ చేసే కలకలం వింటూనే వాళ్ళ గుర్రాలు పెద్దగా సకిలించి, గిట్టలతో భూమిని మోద సాగినై. ఆ చప్పుడుకు ఉగ్రదత్తుడూ, రుద్రారుద్రులూ ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు.

చెట్టు మీది నుంచి చూశాను. నేను ఊహించిన దానికన్న ఎక్కువ దూరం వుండినా వుండవచ్చు." అన్నాడు రుద్రుడు.

"ఎంత దూరం అయితే మనకేం? గుర్రా లెక్కండి." అన్నాడు అరుద్రుడు.

ముగ్గురూ గుర్రాలు కట్టివేసి వున్న చెట్టు దగ్గరకు వెళ్ళి, వాటి తాళ్ళు విప్పుతూన్నంతలో, అల్లంత దూరాన్నుంచి పెద్దగా ఆర్తనాదం వినబడింది.

అది వింటూనే స్నేహితులు ముగ్గురూ నిశ్చేష్టులయ్యారు. ఆ ఆర్తనాదం చేసినది ఒక స్త్రీ కంఠం.

"ఎవరో స్త్రీ ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నది!" అన్నాడు రుద్రుడు.

"ఊఁ, త్వరగా రండి, పరిగెత్తండి!" అంటూ ఉగ్రదత్తుడు కత్తి దూసి ఆర్త నాదం వచ్చిన దిక్కు కేసి వేగంగా పరిగెత్త సాగాడు.

స్నేహితులు ముగ్గురూ కొంత దూరం పరిగెత్తేసరికి, చెట్ల వెనకగా కొన్ని మానవాకారాలు కనిపించినై. మరి కొంత దూరం ముందుకు వెళ్ళేసరికి, పట్టువస్త్రాలు ధరించి, సర్వాభరణాలతో వున్న ఒక యౌవనవతిని, నలుగురు పులిరాయుళ్ళు పట్టుకునేందుకు చేసే ప్రయత్నం వాళ్ళ కంటబడింది. ఆమె, ఆమె వెంట వున్న దాసీలూ పులిరాయుళ్ళకు చిక్కకుండా పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెడుతున్నారు.

"భయం లేదు, వస్తున్నాం!" అంటూ ఉగ్రదత్తుడూ, రుద్రారుద్రులూ కేక పెట్టారు. ఆ మరుక్షణం చెట్ల కొమ్మల మీది నుంచి బిలబిలమంటూ కొందరు పులిరాయుళ్ళు వాళ్ళ మధ్యకు దూకారు. ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ, ఈ అనుకోని దాడికి నిశ్చేష్టులై తెప్పరిల్లే లోపలే, పులిరాయుళ్ళు వాళ్ళను నిరాయుధుల్ని చేసి, తాళ్ళతో కాళ్ళూ చేతులూ బిగించి, భయంకర పక్షుల కేసి లాక్కుపోయారు. —(ఇంకావుంది)






పద్మావతీ నగరంలో దేవరాతుడూ, భూరివసువూ అనే బాల్యమిత్రులుండేవారు. వారు కలిసి చదువుకుంటూ ఉండి, "మనం పెద్దవాళ్ళమయాక మనలో ఒకరికి కొడుకూ, ఇంకొకరికి కూతురూ పుడితే వారికి పెళ్ళి చేసి వియ్యంకులమవుదాం," అనుకున్నారు. తరవాత దేవరాతుడు విదర్భరాజువద్ద మంత్రి అయాడు, భూరివసువు పద్మావతీ నగర రాజువద్ద మంత్రి అయాడు. వారు అనుకున్నట్టే దేవరాతుడికి మాధవుడనే కొడుకూ, భూరివసువుకు మాలతి అనే కూతురూ కలిగారు.

తానూ తన మిత్రుడూ చిన్నతనంలో అనుకున్న మాట దేవరాతుడు మరవలేదు. అయినా మాలతీ మాధవులను బలాత్కరించి పెళ్లిచేసేకన్న వారిద్దరినీ ఒకచోట చేర్చి, వారు పరస్పరం చూసుకుని, ప్రేమించుకుని, పెళ్ళాడే అవకాశం కలిగించటం మంచిదని ఆయనకు తోచింది. అందుచేత ఆయన తన కొడుకైన మాధవుణ్ణి, తర్క విద్య అభ్యసించే మిషమీద పద్మావతీ నగరానికి పంపాడు. మాధవుడి వెంట అతని చెలికాడైన మకరందుడూ, సేవకుడైన కలహంసకుడూ వెళ్ళారు.

మాధవుడు పద్మావతీ నగరం వచ్చాక తరుచు మంత్రిగారి ఇంటిముందుగానే వస్తూ పోతూ ఉండటంచేత మంత్రిగారి మేడమీద అతనికి మాలతి కనిపించేది. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నాక ఇద్దరి హృదయాలలోనూ ప్రేమబీజాలు పడ్డాయి.

మాలతికి మదయంతిక అనే స్నేహితురాలున్నది. మదయంతిక అన్న నందనుడనే వాడు రాజుగారికి ఆప్తమిత్రుడు. మదయంతికను చూసినది మొదలు మాధవుడి మిత్రుడైన మకరందుడి మనసులో ప్రేమ అంకురించింది.

భవభూతి నాటక కథ



రాజుగారితో నివేదించుతున్నాడు. రాజుగారు తన మంత్రితో, "నీ కుమార్తె మాలతిని నందనుడికి ఇచ్చి పెళ్లిచెయ్యి!" అన్నాడు. నందనుడు వయసు మళ్లినవాడే గాక కురూపికూడాను. కనక భూరివసువుకు అతణ్ణి అల్లుడుగా చేసుకోవటం సుతరామూ ఇష్టంలేదు. అయినా రాజుగారికి ఎదురాడటం తగదుగనక, "ప్రభువుల కన్యలకు ప్రభువుల ఇష్టప్రకారం జరగక ఏంచేస్తుంది?" అన్నాడు.

పద్మావతీనగరంలోనే కామందక అనే యోగిని ఉన్నది. మాలతీమాధవుల తండ్రులు చిన్నతనంలో వియ్యంకుల మవుదామని ఆమె ఎదటనే ప్రతిజ్ఞ చేసుకున్నారు. అదీగాక కామందకి మాలతికి ఒక రక్షకురాలులాగా ఉంటూవచ్చింది. ఈ కారణాలన్నిటినీ బట్టి ఆమె మాలతీ మాధవుల మధ్య ప్రణయాన్ని పెంపొందించి, వారు పెళ్లాడేలాగ చేయాలనే ఉద్దేశంతో ఉన్నది.

అయితే ఆమె ఉద్దేశానికి అనుకోని విఘాతం జరిగింది. రాజుగారి ఆప్త మిత్రుడైన నందనుడికి మాలతిని పెళ్ళాడాలనే దురాశ పుట్టింది. ఆయన ఆ సంగతి చల్లగా

ఈ సంగతి యోగిని కామందకికి తెలిసింది. ఎలాగయినా మాలతీ మాధవుల మధ్య ప్రేమ పెంపొందేటందుకు తగిన ఉపాయాలు చూడమని ఆమె తన శిష్యురాలైన బుద్ధిరక్షితతో చెప్పింది.

ఈలోపుగా మాలతి తాను ప్రేమించిన మాధవుడి రూపాన్ని చిత్రించింది. మాలతికి లవంగిక అనే చెలికత్తె ఉన్నది. ఈమె ఈ చిత్తరువును మాధవుడికి చేర్చే ఉద్దేశంతో కామందకి వద్ద ఉండే ఒక పరిచారికకిచ్చింది; మాధవుడి సేవకుడు కలహంసుడు ఈ పరిచారికను ప్రేమిస్తున్నాడు.

ఒకనాడు మన్మథోత్సవం జరిగింది. మాధవుడు మకరందోద్యానానికి వచ్చి, ఒక పొగడచెట్టుకింద కూచుని, అక్కడ రాలిన

పొగడపూలు ఏరి మాలగా గుచ్చసాగాడు. అంతకు ముందే చెలికత్తెలతో సహా కామ దేవాలయానికి వెళ్లిన మాలతి తిరిగివస్తూ ఆ ప్రాంతం చేరింది. ఆమెను చూస్తూ మాధవుడు కలవరపడి తాను గుచ్చుతున్న పూలను వంకరటింకరగా గుచ్చి ఎలాగో పూర్తిచేసి తన మెడలో వేసుకున్నాడు. ఇంతలో మాలతికోసం ఏనుగు వచ్చి ఆమెను ఎక్కించుకుపోయింది.

మాలతి చెలికత్తె అయిన లవంగిక మటుకు అక్కడే ఉండి పూలు కోసేదానిలాగా అభినయిస్తూ, మాధవుణ్ణి పలకరించి, "అయ్యో, మీ మెడలో ఉండే పొగడదండ ఎంతో చక్కగా ఉంది. మా మాలతికి ఇలాటి దండలు ఎంతో ఇష్టం," అన్నది. మాధవుడు ఆ పొగడదండను తీసి లవంగికకు ఇచ్చేశాడు.

లవంగిక వెళ్ళిపోయాక మకరందుడు మాధవుణ్ణి వెతుక్కుంటూ ఆ ఉద్యానానికే వచ్చాడు. మాధవుడు తన ప్రేమగొడవ అంతా తన స్నేహితుడితో చెప్పుకుని, తనను మాలతి ప్రేమిస్తున్నదో లేదో అని మధన పడుతుండగా, అతని సేవకుడు కలహంసుడు ఒక చిత్తరువు తెచ్చి ఇచ్చాడు. అది మాలతి రచించిన మాధవుడి బొమ్మ.



ఈ బొమ్మ చూసుకున్నాక మాలతి తనను ప్రేమిస్తున్నట్టు మాధవుడికి రూఢి అయింది. తరవాత అతను మకరందుడి ప్రేరణతో తన బొమ్మ పక్కన మాలతి బొమ్మ చిత్రించాడు. దానికింద అతను ఒక శ్లోకం రాసి, తనకు మాలతిని చూస్తే కలిగే ఆనందం మరి దేనివల్లా కలగదని స్పష్టం చేశాడు. సరిగా ఈ సమయానికి కలహంసుడి ప్రియురాలు వచ్చి చిత్తరువును పట్టుకుపోయి లవంగికకు చేర్చింది.

మాధవుడు గుచ్చిన పొగడదండా, చిత్తరువూ మాలతికి చేరాయి. వాటిని చూసి మాలతికి మాధవుడిపైన మరింత ప్రేమ



కలిగింది. కాని యోగిని కామందకి వచ్చి, మాలతికీ వయసుమళ్ళిన నందనుడికీ పెళ్ళి జరగాలని రాజుగారు ఆజ్ఞాపించినట్టు తెలియజేసింది. మాలతి విచారసాగరంలో మునిగిపోయింది. వివాహం విషయంలో రాచకన్నెలు తల్లిదండ్రుల ఆజ్ఞకు కట్టుబడి ఉండనవసరం లేదనీ, తమకిష్టమైనవారిని గాంధర్వవిధితో వివాహమాడవచ్చుననీ సలహా చెప్పి కామందకి వెళ్ళిపోయింది.

మాలతీ మాధవులను ఒకచోట చేర్చటానికి సర్వవిధాలా యత్నిస్తున్న యోగిని కామందకి ఒకనాడు మాధవుణ్ణి శివాలయం ఆవరణలో చెట్ల గుబురు చాటున ఉంచి, ఆలయానికి వచ్చిన మాలతిని ఆ సమీపంలో కూచోబెట్టి మాలతికి మాధవుడిపైగల ప్రేమను గురించి మాట్లాడించింది.

మాలతి మాటలు విని మాధవుడు ఆనందపారవశ్యంలో ఉండగా దూరం నుంచి కేకలు వినిపించాయి. మాలతి స్నేహితురాలూ, నందనుడి చెల్లెలూ అయిన మదయంతికకు ఒక పులివల్ల ప్రమాదం తటస్థించింది. మాధవుడు తానున్న చెట్ల మాటునుంచి బయటికి వచ్చి పులి ఉన్న దిక్కుగా పరిగెత్తాడు. కాని దైవవశాన అటుగా వస్తున్న మకరందుడు పులితో కలియబడి పోరాడి, దాన్ని చంపి, తాను మూర్ఛపోయాడు. అతని గాయాలూ, నెత్తురూ చూసి మాధవుడు కూడా మూర్ఛపోయాడు. మదయంతిక తన ప్రాణాలు కాపాడిన మకరందుడికోసం కంగారు పడింది కాని యోగిని తన కమండలంలోని జలం ముఖాన చల్లగానే అతను తేరుకున్నాడు. మాలతి తన నుదురు నిమిరేసరికి మాధవుడు కూడా కళ్ళు తెరిచాడు.

ఇంతలో మదయంతిక కోసం ఒక సేవకుడు వచ్చి, "అమ్మా, మీ అన్నగారికీ మాలతికీ పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయట. మిమ్మల్ని వెంటనే రమ్మన్నారు," అని

చెప్పాడు. తన స్నేహితురాలైన మాలతి తనకు వదినె కాబోతున్నదని మదయంతిక ఎంతో సంతోషించింది.

మాధవుడు మాత్రం పూర్తిగా కుంగిపోయాడు. యోగిని అతనికి ధైర్యం చెప్పి మాలతిని వెంటబెట్టుకుని వెళ్ళిపోయింది. కాని మాధవుడు ధైర్యం చెందలేదు; "ఎలాగూ మాలతి నాకు దక్కదు. నా జన్మ వృథా! ఇక నేను శ్మశానాలలో పిశాచాలకు నరమాంసం అమ్ముకుంటూ తిరగవలిసిన వాణ్ణే!" అనుకున్నాడు.

అతను నిజంగానే శ్మశానంలో తిరగసాగాడు. ఆ శ్మశానాన్ని అనుకుని కరాళశక్తి ఆలయం ఉన్నది. ఆ ఆలయంలో అఘోరఘంటుడనే కాపాలికుడు, కపాలకుండల అనే తన శిష్యురాలితో చేరి ఉపాసన చేస్తున్నాడు. వాడు శక్తికి ఒక అందగత్తె అయిన కన్యను బలి ఇవ్వదలిచి తన శిష్యురాలిని పంపాడు. ఆమె మంత్రశక్తిచేత మాలతినే తెచ్చింది; ఆ సమయంలో మాలతి మేడలో ఒంటరిగా పడుకుని నిద్రపోతున్నది.

అఘోరఘంటుడు మాలతిని వధ్య చిహ్నాలతో అలంకరించి దేవికి పూజ ప్రారంభించాడు. తనకు చావు సమీపించిం



దని గ్రహించి మాలతి తన తల్లినీ, యోగిని కామందకినీ, తన చెలికత్తె లవంగికనూ ఎలుగెత్తి పిలుస్తూ ఏడ్చింది. శ్మశానంలోనే తిరుగుతున్న మాధవుడు ఆలయం వేపు నుంచి మాలతి గొంతు వినిపించేసరికి ఆశ్చర్యపడి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

ఆ సమయాన అఘోరఘంటుడు కత్తి ఎత్తి మాలతిని నరకబోతున్నాడు. ఆమె మాధవుణ్ణి చూసి, "రక్షించు, రక్షించు!" అంటూ అతన్ని గట్టిగా కౌగలించుకున్నది. మాధవుడు అఘోరఘంటుడి చేతి కత్తి లాగేసి వాణ్ణి చంపేశాడు. అంతలోనే మాలతిని వెతుక్కుంటూ కొందరు మనుషులు



వచ్చారు. వారివెంట మాలతి, క్షేమంగా ఇల్లు చేరింది.

కపాలకుండల మటుకు తన గురువును చంపిన మాధవుడిపైన పగ తీర్చుకుంటానని శపథం చేసి తన మాయచేత తప్పించుకు పోయింది.

అక్కడ రాజుగారి ఇంట నందనుణ్ణి పెళ్ళికొడుకుని చేశారు. వారు సపరివారంగా పెళ్ళికూతురి ఇంటికి రాబోతున్నారు. యోగిని మాలతి తల్లితో, "అమ్మాయిని పెళ్ళికూతుర్ని చేసేముందు గ్రామదేవతకు మొక్కించి తెస్తాను!" అన్నది. ఆమె అంతకుముందే మాధవుణ్ణీ, మకరందుణ్ణీ గ్రామదేవత ఆలయానికి పంపి, గర్భగుడిలో దాగి ఉండమన్నది. మాలతీ లవంగికా యోగిని వెంట ఆలయానికి వచ్చారు. మాలతిని పెళ్ళికూతుర్ని చెయ్యటానికి రాజుగారు పంపిన వస్త్రాభరణాలు కూడా ఆలయం వద్దకే చేరాయి.

యోగిని ఆలయంలో మాలతిని మాధవుడికి కన్యాదానం చేసి, "మీరిద్దరూ చెట్ల చాటున పడి, మా విహారానికి చెందిన ఉద్యానవనానికి వెళ్ళండి. అక్కడ మీ పెళ్ళికి ఏర్పాట్లన్నీ సిద్ధంగా ఉన్నాయి. మకరందుడూ, మదయంతికా కూడా అక్కడికి వస్తారు," అని చెప్పి పంపేసింది. తరవాత ఆమె మకరందుడికి రాజు పంపిన వస్త్రాభరణాలతో పెళ్ళికూతురువేషం వేసి, అతన్నీ, లవంగికనూ వెంటబెట్టుకుని భూరి వసువుగారింటికి వెళ్ళింది.

మాలతి వేషంలో ఉన్న మకరందుడికీ నందనుడికీ పెళ్ళి జరిగిపోయింది. మోసం బయటపడకుండా యోగిని ఎంతో శ్రద్ధ తీసుకున్నది. నందనుడు పెళ్ళికాగానే "పెళ్ళికూతురు"తో సహా తన ఇంటికి వెళ్ళి గృహప్రవేశం చేశాడు. ఆ రాత్రి నందనుడు పడక గదిలో "పెళ్ళికూతురు"తో సరసం చెయ్యబోయ్యేసరికి, మాలతి వేషం ధరించిన మక

రందుడు ఒక్క తోపు తోసేశాడు. నంద నుడు, "ఛీ, ఇది చిన్నతనంనుంచీ చాలా దుష్టురాలు!" అనుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అందరూ నిద్రపోతున్నారు. ఆ సమయంలో యోగిని శిష్యురాలయిన బుద్ధి రక్షితా, మాలతి చెలికత్తె అయిన లవంగికా మదయంతికను నిద్ర లేపి తెచ్చారు. తన అన్న పెళ్ళిచేసుకున్నది మాలతిని కాదనీ, తన ప్రియుడైన మకరందుణ్ణి అనీ ఆమె తెలుసుకున్నది. తరవాత వాళ్ళు నలుగురూ కలిసి యోగిని ఉండే విహారం పక్కన గల తోటకు బయలుదేరారు.



కాని దారిలో రాజభటులు వారికి అడ్డం తగిలి అనుమానంమీద మకరందుణ్ణి పట్టుకుపోయారు. బుద్ధిరక్షితా, మదయంతికా, లవంగికా నిశ్చేష్టులై ఉండగా మాధవుడి సేవకుడు కలహంసుడు అటుగా వచ్చి వారిని మాలతీ మాధవులున్న చోటికి తీసుకుపోయాడు.

ఈ వార్త వింటూనే మాధవుడు తన మిత్రుణ్ణి రక్షించటానికి బయలుదేరాడు. అతను వెళ్ళిన కాస్సేపటికి మాలతి ఒంటరిగావున్న సమయం చూసి, కపాలకుండల ఆమెను తీసుకుని శ్రీశైల మార్గాన బయలుదేరింది. తన గురువును చంపినందుకు మాధవుడిపై పగ తీర్చుకోవటానికి ఆమె సమయంకోసం వేచి ఉన్నదికదా, ఆ సమయం ఇప్పుడామెకు దొరికింది. మదయంతిక మొదలైనవాళ్ళు ఆమెకోసం వెతుక్కొని కంగారుపడ్డారు.

ఈలోపల మకరందుడు తనను పట్టుకున్న రాజభటులతో హోరాహోరి పోరాటం సాగించాడు త్వరలోనే మాధవుడు కూడా అతనికి అండగా యుద్ధం ప్రారంభించాడు. నందనుడి వివాహం భగ్నంచేసి, మదయంతికను ఎత్తుకుపోయాడని మకరందుడిపై నేరం మోపిన రాజు తన మేడపై

నుండి, తన భటులతో వీరోచితంగా పోరాడే యువకుల నిద్దరినీ చూసి ముచ్చటపడి, వారిని తీసుకురమ్మని భటులను పంపాడు.

మాధవ మకరందులు రాజుగారికి తమ పుట్టుపూర్వోత్తరాలు తెలిపి, ఆయునచేత గౌరవించబడి తమ ప్రియురాళ్లతో ఈ విషయం చెప్పటానికి విహారపు తోటకు వచ్చారు. అక్కడ మదయంతిక ఉన్నదిగాని మాలతి లేదు. మాధవుడు కామందకి వద్దకు వెళ్లాడు. మాలతి అక్కడా లేదు. మాధవుడికి మతి చెడిపోయింది. అతను మాలతిని వెతుక్కుంటూ అడవిని పడి, కనిపించిన ప్రతి మృగాన్నీ, "మీకు మాలతి కనబడిందా?" అని అడగసాగాడు. మకరందుడు అతని వెంటనే నీడలాగా ఉన్నాడుగాని, అతన్ని ఊరడించలేకపోయాడు. తన మిత్రుడి అవస్థ చూడలేక మకరందుడు ఏ కొండపై నుంచి అయినా దూకి ఆత్మహత్య చేసుకుందామని కూడా అనుకున్నాడు.

అదృష్టవశాత్తూ కపాలకుండలకు సౌదామిని అనే యోగిని ఎదురుపడింది. ఈ సౌదామిని కామందకి శిష్యురాలు, మహా శక్తి సంపన్నురాలు. ఆమె కపాలకుండలను ఓడించి, మాలతిని కాపాడి శ్రీశైలంలోనే భద్రంగా ఉంచి, ఆమె మెడలోని పొగడదండను గుర్తుగా తీసుకుని మాధవుణ్ణి వెతుకుతూ బయలుదేరింది. మకరందుడు ఆత్మహత్య చేసుకోబోతూండగా ఆమె దేవుడులాగా అక్కడికి వచ్చి అతనికి మాలతి క్షేమవార్త చెప్పింది. తరవాత ఆమె మాలతీ మాధవులను ఒకచోట చేర్చింది.

జరిగిన సంగతులన్నీ తెలిసినాక రాజు మాలతీ మాధవుల వివాహానికి సంతోషంతో ఆమోదించాడు. అదేవిధంగా ఆయన మదయంతికా మకరందుల వివాహానికి కూడా సమ్మతించాడు. చిన్నతనంలో దేవరాతుడూ, భూరివసువూ అనుకున్న ప్రకారంగా వియ్యంకులు కాగలిగారు.





# పిశాచాల జేగంటు

పూర్వం చీనాలో ఒక అన్నా, ఒక తమ్ముడూ ఉండేవారు. కావటానికి వాళ్ళు ఒకతల్లి పిల్లలే అయినా వాళ్ళ బుద్ధులలో ఎంతో వ్యత్యాసం ఉండేది.

అన్న చాలా చెడ్డవాడయితే, తమ్ముడు ఎంతో బుద్ధిమంతుడు.

తండ్రి పోగానే అన్న డబ్బంతా తన సొంతం చేసుకుని, దాన్ని హెచ్చు వడ్డీలకు అప్పులిచ్చి ధనవంతుడయాడు. తమ్ముడు అన్నకు ఎదురుచెప్పక, గ్రామంలోవాళ్ళకు రకరకాలుగా సహాయపడుతూ, అస్తమానం శ్రమచేస్తూనే, ఇతరుల సహాయంతోనే పొట్ట గడుపుకుంటున్నాడు.

ఒకనాడు తమ్ముడు చక్కెరపాకం కావడి వేసుకుని పారుగూరిలో ఇచ్చి రావలసివచ్చింది. దారి కొండదారి. అంతకు ముందే వాన కురియటంచేత కొండచెరియ జారుడుగా ఉన్నది. తమ్ముడు కావడి వేసుకుని కొండదారివెంట ఎక్కుతూండగా కాలు జారింది. వాడు పాకం కడవలతోసహా పల్లానికి దొర్లాడు. కడవలలో ఉన్న పాకమంతా వాడి ఒంటినిండా పట్టి గట్టిగా బిగుసుకున్నది.

వాడు పడిన చోటునుంచి లేచే లోపుగా కొన్ని పిశాచాలు అటుగా వచ్చి, "అమ్మయ్యో! ఎంత పెద్ద చక్కెర బొమ్మో!" అని కేకలు పెట్టాయి. కొన్ని పిశాచాలు అప్పటికప్పుడే ఆ చక్కెరబొమ్మను తినెయ్యాలనుకున్నాయి. కాని అంత పెద్ద చక్కెర బొమ్మను ఒక్కపాళంగా తినటం సాధ్యం కాదు. అందుచేత పిశాచాలన్నీ సాయంపట్టి తమ్ముణ్ణి తమ గుహకు తీసుకుపోయి, ఒక రాతిమీద పడుకోబెట్టాయి.

తరవాత పిశాచాలు ఆ చక్కెరబొమ్మ చుట్టూ గుంపుగా చేరి కొన్ని చక్కెర పెళ్లలు గిల్లుకు తిన్నాయి.

చీనా జానపద కథ

ఇంతలో ఒక కొమ్ములు గల పిశాచం, "ఇక చాలు. చక్కెర జాస్తిగా తింటే అన్నం సయించదు. తిండి తిని మనం ఆడుకోవటానికి పోవాలి. మన జేగంట పట్టుకు రండి!" అన్నది.

తమ్ముడు అంతసేపూ కదలక మెదలక చక్కెర బొమ్మలాగే ఉండిపోయాడు. తాను మనిషి అని తెలిస్తే ఆ పిశాచాలు తనను బతకనివ్వక నానా హింసా పెడతాయని వాడికి తెలుసు.

నెత్తిన కొమ్ములు గల పిశాచం జేగంట వాయించేసరికల్లా గారడీలాగా రకరకాల ఆహార పదార్థాలు వచ్చేశాయి.

ఆ పదార్థాల ఘుమాయింపు ముక్కుకు తగిలేసరికి తమ్ముడికి నోరూరి, చెడ్డ ఆకలి అయింది. పిశాచాలు ఆ పదార్థాలన్నిటినీ సంతోషంతో తిని, జేగంట ఒకచోట భద్రంగా దాచి, గంతులేసుకుంటూ ఆడుకోవటానికి వెళ్ళిపోయాయి.

గుహలో ఇంకెవరూ లేకుండా పోయాక తమ్ముడు రాతిపైనుంచి చెంగున లేచి, దాచి ఉన్న చోటినుంచి జేగంట సంగ్రహించి, దాన్ని తన చొక్కాలో దాచుకుని, కాలి సత్తువకొద్దీ ఇంటికి పరిగెత్తాడు.

ఆ తరవాత తమ్ముడికి భోజనం సమస్య తీరిపోయింది. వాడు కావాలన్నప్పుడల్లా



జేగంట తీసుకుని వాయిస్తేచాలు మృష్టాన్నం సిద్ధంగా ఉండేది.

తమ్ముడికి పట్టిన ఈ అదృష్టం గురించి వివరాలు తెలియగానే అన్నకు పట్టరాని అసూయ పుట్టుకొచ్చింది. తమ్ముడిలాగా చేస్తే తనకూ అలాటి అదృష్టం పడుతుందని వాడుకూడా ఒక చక్కెరపాకం కావడి భుజాన వేసుకుని అదే కొండదారిన బయలు దేరాడు. ఈసారి బురదా, జారుడూ లేవు. అందుచేత అన్న కావాలని పడి పల్లానికి దొర్లి, పాకం ఒళ్ళంతా పూసుకుని, పడు కున్నాడు. కొంతసేపటికి పిశాచాలు అటుగా వచ్చాయి. అవి అన్నను చూసి, "పారిపోయిన చక్కెరమనిషి ఇడుగో! వీణ్ణి మన గుహకు తీసుకుపోయి ఏంచెయ్యాలో అది చేద్దాం," అని అరిచాయి.

ఈ మాటలు విని అన్న, తన పంట పండిందిగదా అనుకుని సంతోషించాడు.

పిశాచాలు అన్నను భుజంమీద వేసుకుని ఎత్తుకుపోయి తమ గుహలోని రాతిమీదికి చేర్చాయి.

కొమ్ముల పిశాచం, "కిందటిసారి ఈ చక్కెరమనిషి మన జేగంట దొంగిలించుకుపోయాడు. అందుచేత ఈసారి మనం వీణ్ణి భాండంలో కొంచెం ఉడకబెట్టి ఉంచుదాం!" అన్నది.





పిశాచాలు అన్నను ఒక ఖాళీ భాండంలో పెట్టి, నీళ్ళు పోసి, భాండంకింద మంట చేశాయి. భాండంలో నీరు కాగి వేడి ఎక్కుతున్న కొద్దీ అన్నకు బాధ హెచ్చింది. చివరకు వాడు వేడి భరించలేక, భాండంలో నుంచి బయటికి దూకి గుహ బయటికి పరిగెత్తాడు. కాని వాడు ఎంతో దూరం పోక మునుపే పిశాచాలు వెంటపడి వాణ్ణి పట్టుకున్నాయి.

కొమ్ముల పిశాచం మిగిలిన పిశాచాలతో, "వీడు మళ్ళీ మనకు చిక్కుతాడో లేదో, మనం ఎప్పటికీ జ్ఞాపకం ఉండేటట్టుగా వీడికి తగిన శిక్షచేసి పంపుదాం!" అన్నది.

తరవాత ఒక్కొక్క పిశాచమే వచ్చి అన్న ముక్కు పట్టుకుని ఒక అడుగు పొడుగు సాగదీసింది. అన్న ముక్కు ఏడు అడుగుల పొడుగు సాగింది. ఆ తరవాత పిశాచాలు వాణ్ణి గుహలోనుంచి విసిరి బయట పారేశాయి.

చావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా అన్న తన ముక్కును చుట్టచుట్టి చేతిలో పట్టుకుని, బతుకు జీవుడా అంటూ తన కొంపకు చేరాడు.

తన మొగుడు పిశాచాల దగ్గిర దొంగిలించి ఏదో మహత్తు గల వస్తువు తెస్తాడని ఆశతో ఎదురు చూస్తున్న అన్న భార్య తన భర్త పిలుపు వినగానే తలుపు తెరిచి బయటికి వచ్చింది.

అన్న బాధతో, "నా ముక్కుమీద నిలబడ్డావు, తొలగవే!" అని ఇల్లు అదిరేలా కేక పెట్టాడు.

"అంతా చోద్యం! మీ ముక్కుమీద నేనెలా నిలబడతానూ!" అంటూ ఆవిడ భర్తకేసి పరీక్షగా చూసి నిర్ఘాంతపోయింది.

అన్న తన భార్యకు జరిగినదంతా చెప్పాడు. ఆవిడ అంతా విని నిట్టూర్చి, "పిశాచాలు చేసినదానికి పిశాచాల దగ్గిరే విరుగుడు ఉంటుంది. అయినా నేను వెళ్ళి

మి తమ్ముణ్ణి సలహా అడిగి వస్తాను!" అంటూ బయలుదేరింది.

వదినెగారు తనకోసం వచ్చేసరికి తమ్ముడు నాగలి కట్టుకుని పొలానికి పోబోతున్నాడు. వాడు చిత్రమైన మనిషి. తనవద్ద ఉన్న జేగంట ఒక్క తిండేగాక ఇంకా ఏది కావలిసినా ఇస్తుందని వాడు అదివరకే తెలుసుకున్నాడు. అయినప్పటికీ వాడు పని లేకుండా సోమరిబతుకు బతకటం ఇష్టం లేక, ఆ గంట సహాయంతో తనకు కావలిసిన వ్యవసాయ పరికరాలు మాత్రం సంపాదించుకుని తరవాత గంటను పెట్టెలో దాచిపెట్టేసి, కష్టించి జీవిస్తున్నాడు.

"ఏం, వదినా, ఇలా వచ్చావు?" అని వాడు అన్న భార్యను అడిగాడు.

ఆవిడ కంట తడి పెట్టుకుంటూ అన్నకు పిశాచాలు చేసిన శిక్ష గురించి వివరంగా చెప్పింది. తమ్ముడు అంతా విని, "నేను పిశాచాలుండే కొండప్రాంతానికి మరొకసారి వెళ్ళి అన్న ముక్కు సరిచేసే మార్గం ఏమైనా ఉందేమో తెలుసుకు వస్తాను," అన్నాడు.

ఆ రోజు పిశాచాలు తిండి తినే వేళకు తమ్ముడు అవి ఉండే గుహను చేరుకుని లోపల పిశాచాలు అడుకునే మాటలను శ్రద్ధగా ఆలకించాడు.



మాటల మధ్యను ఒక పిల్ల పిశాచం, "పాపం, ఆ చక్కెరమనిషి ముక్కు ఏమయిందో!" అన్నది.

"వాడికి బుద్ధి ఉంటే దాన్ని సరిచేసుకునే సాధనం వాడిదగ్గిరే ఉన్నది. జేగంట మీద ఒక్కొక్క దెబ్బే కొట్టి, 'తగ్గు! తగ్గు!' అంటుంటే వాడి ఏడు అడుగుల పొడుగు ముక్కు కొంచెం కొంచెమే తగ్గిపోతుంది," అన్నది కొమ్ముల పిశాచం.

ఈమాట విన్నాక తమ్ముడు అక్కడ మరి నిలవక సరాసరి ఇంటికి పరిగెత్తుకొచ్చాడు; తన పెట్టెలోనుంచి పిశాచాల జేగంట తీసుకుని తన అన్న ఇంటికి వెళ్ళాడు.

"ఊం, ఊం! మీ అన్న ముక్కు చప్పున మామూలుగా చేసెయ్యి!" అని వదినె అతన్ని తొందర పెట్టింది.

తమ్ముడు గంటమీద ఒక దెబ్బ కొట్టి, అన్న ముక్కుకేసి చూస్తూ, "తగ్గు!" అన్నాడు. అన్న ముక్కు మూడంగుళాలు తగ్గింది. వాడు మరొక దెబ్బ కొట్టి మళ్లీ "తగ్గు!" అన్నాడు. అదీ మళ్లీ మూడంగుళాలు తగ్గింది.

ఒక పావుగంట గడిచేసరికి అన్న ముక్కు నాలుగడుగుల పొడుగుమాత్రమే ఉన్నది. కాని అన్న భార్యకు ఆ పావుగంటా ఒక యుగంలాగా తోచింది. తమ్ముడు తెలివి తక్కువవాడై తాత్సారం చేస్తున్నాడని ఆమెకు తోచింది.

ఆవిడ ఇక భరించలేక తమ్ముడి చేతిలో నుంచి జేగంటా, శీలా లాగేసుకుని, "తగ్గు, తగ్గు, తగ్గు....!" అంటూ గంటను గబగబా బాదసాగింది. ఈ బాదుడు ఫలితంగా గంట కాస్తా పగిలి ముక్కలై పోయింది. ఆసరికే అన్న ముక్కు తగ్గిపోవటమే గాక అసలు ముక్కే లేకుండాపోయింది. భార్య బుద్ధి తక్కువవల్లా, తొందరపాటువల్లా వాడు శాశ్వతంగా ముక్కిడి అయిపోయాడు!





# చిలుక పలుకు

ఒక ఊళ్లో కొంచెం ఆస్తిపరురాలైన ముసలావిడ ఉండేది. ఆవిడకు ఒక మనవరాలు తప్ప మరెవరూ లేరు. ముసలిది ఆ మనవరాలిని ఎంతో కట్టుదిట్టంలో ఉంచి భయభక్తులతో పెంచేది. ఆ పిల్ల బయటికి వెళ్లి తన యీడు పిల్లలతో ఆడుకోరాదు, ఆ పిల్లలు ఈ పిల్లకోసం రాగూడదు!

మనవరాలికి ఇల్లు బందిఖానాలాగుండేది. ఇంట్లో అవ్వా, ఒక రామచిలుకా తప్పిస్తే ఇంకేమీ లేదు. ఇతర పిల్లలు స్వేచ్ఛగా తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ, కేరింతలు కొడుతుంటే మనవరాలికి ముసలిదానిపైన మండిపోయేది. కాని ముసలిదంటె చెడ్డ భయం కావటంచేత ఆవిడ ఎదట తుక్కిన పేనులాగా, అమాయికంగా ఉండేది; ముసలిది లేనప్పుడుమాత్రం కసి కొద్దీ, "ఈ ముసలిముండ చచ్చిపోయినా బాగుండును!" అని పైకే అనుకునేది.

వినగా వినగా రామచిలుకకు ఈ మాటలు నోటపట్టాయి. అది ఒకనాడు ముసలిది వింటూండగా, "ఈ ముసలిముండ చచ్చిపోయినా బాగుండును!" అనేసింది.

ముసలమ్మ ఈ మాటలకు నిర్ఘాంతపోయింది. అస్తమానం ఇంటోనే ఉండే రామచిలక్కి ఇలాటి పాపిష్టి మాటలు ఎలా వస్తాయి? ఆవిడకు తన మనవరాలిపైన అనుమానం తగల్లేదు, ఎంచేతంటె, నోట్లో నాలుక లేనట్టు కనిపించే ఆ పిల్ల నిష్కారణంగా అటువంటి మాటలు ఎందుకంటుంది?

ఒకనాడు ముసలావిడతో తమ ఇంటి సొద ఏదో చెప్పుకోవటానికి పొరుగింటి ముసలామె వచ్చింది. ఇద్దరూ మాట్లాడుకునే సమయంలో రామచిలుక తపీమని, "ఈ ముసలిముండ చచ్చిపోయినా బాగుండును!" అన్నది. ఈ మాటలు వింటూనే పొరుగింటి

అర్. సరోజిని

ముసలమ్మ వెలవెలపోయి, మాట్లాడే మాట కూడా పూర్తి చెయ్యకుండా, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. ముసలిదానికి తల తీసేసినట్టయింది.

ఎలాగైన ఆ చిలుకచేత ఇటువంటి మాటలు మాట్లాడకుండా చేయించాలని ముసలిదానికి అనిపించింది. పొరుగునే ఒక శాస్త్రుల్లుగారున్నాడు. వారింట కూడా ఒక రామచిలుక ఉన్నది. అందుచేత చిలుకల సంగతి ఆయనకు బాగా తెలుసు.

ముసలిది శాస్త్రుల్లుగారింటికి వెళ్ళి, "అయ్యా, మా చిలుక పాపిష్టి మాటలు నేర్చింది. ఎవరైనా ఇంటికి రాభయంగా ఉంటున్నది. దానికి కాస్త మంచిమాటలు అలవడే దారి చెబుదురూ," అన్నది.

శాస్త్రుల్లుగారు, "అదేమంత కష్టమైన పనికాదే. మా చిలుక చాలా మంచిమాటలు మాట్లాడుతుంది. దాని నోట ఎన్నడూ ఒక్క చెడ్డమాట రాదు. కావలిస్తే మా చిలుకను మీ చిలుక పంజరంలోనే నాలుగు రోజుల పాటు ఉంచుకోండి. దానినుంచి మీ చిలుక కూడా నాలుగు మంచిముక్కలు నేర్చుకుంటుంది," అన్నాడు ముసలిదానితో.

"బాబ్బాబు, అపాటి సహాయం చేతురూ!" అన్నది ముసలావిడ ఆశగా.

"దానికేంభాగ్యమమ్మా!" అంటూ శాస్త్రుల్లుగారు తమ చిలుకను ఆవిడకిచ్చాడు. ఆవిడ దాన్ని తెచ్చి తమ చిలుక వుండే పంజరంలో పెట్టింది. ఈ పని చేశాక ఆవిడకు పెద్ద బరువు దించేసినట్టు అనిపించింది.

కాని అంతలోనే ఇంటి చిలుక కొత్తగా వచ్చిన చిలుకను చూసి కళ్ళెర్రచేస్తూ, "ఈ ముసలిది చచ్చిపోయినా బాగుండును!" అన్నది. వెంటనే శాస్త్రుల్లుగారి చిలుక తడుపుకోకుండా, "తథాస్తు!" అన్నది. ముసలావిడకు ఒళ్ళు మండిపోయింది. ఆవిడ పంజరం తెరిచి రెండు చిలుకలనూ వొదిలిపెట్టేస్తూ, "పోయి చావండి!" అని తిట్టింది.





# ముగ్గురు పెళ్ళికొడుకులు

పట్టు విడవని విక్రమార్కుడు మళ్లీ చెట్టు వద్దకు వెళ్లి, దానిపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎంత చెప్పినా నీవు ఈ శ్రమ మానకుండా ఉన్నావు. నీ పట్టుదల నిజంగా సాటిలేనిది. కనీసం నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు ఉజ్జయినీ నగరాన్ని పుణ్యసేనుడనే రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయనవద్ద ఒక బ్రాహ్మడు మంత్రిగా ఉండేవాడు. ఆయన పేరు హరిస్వామి. ఈ హరిస్వామి చాలా సజ్జనుడే గాక రాచకార్యాలలో సమర్థుడుకూడాను.

హరిస్వామికి దేవస్వామి అనే కొడుకూ, సోమప్రభ అనే కూతురూ ఉండేవారు. దేవస్వామి తండ్రికి తగిన కొడుకు, చాలా

## బేతాళ కథలు

బుద్ధిమంతుడు. ఇక సోమప్రభ భూలోక రంభ అని చెప్పవచ్చు.

సోమప్రభకు యౌవనం వచ్చాక తల్లి దండ్రులు ఆమె వివాహం గురించి ఆలో చించసాగారు. తాను అసాధారణ సౌందర్య వతిని అన్న ఉద్దేశంతో సోమప్రభ, ఎవరినో ఒకరిని పెళ్ళాడటం ఇష్టంలేక, మహాశూరుడో, మహాజ్ఞానో, మహావిజ్ఞానో అయితే తప్ప తనకు పెళ్లి చేయవద్దని తల్లికి చెప్పి, ఆ సంగతి తన అన్నకూ, తండ్రికీకూడా చెప్పించింది. ఈ షరతుకు అందరూ సమ్మతించారు.

ఇంతలో ఒక దక్షిణదేశపు రాజు ఉజ్జయిని పైకి దండెత్తి వచ్చాడు. పుణ్యసేన్ మహా రాజు ఆ శత్రురాజుతో సంధి రాయబారం జరప నిశ్చయించి, తన రాయబారిగా వెళ్ల మని హరిస్వామిని పంపాడు. హరిస్వామి దక్షిణదేశానికి వెళ్ళి తాను వచ్చిన పని పూర్తి చేశాడు.

ఆ సమయంలో ఒక బ్రాహ్మణ యువ కుడు హరిస్వామి వద్దకు వచ్చి, "అయ్యా, మీ కుమార్తె గొప్ప సౌందర్యవతి అని విన్నాను. ఆమెను నాకిచ్చి పెళ్ళి చెయ్యండి," అని అడిగాడు.

దానికి హరిస్వామి, "నాయనా, నా కూతురును చేసుకునేవాడు గొప్ప శూరుడైనా కావాలి, జ్ఞాని అయినా కావాలి, విజ్ఞాని



అయినా కావాలి. నీవు ఏ తరగతి కిందికి వస్తావు?" అని అడిగాడు.

"నేను విజ్ఞానిని," అన్నాడాయువకుడు.

"ఏదీ, నీవిజ్ఞానం కొంచెం ప్రదర్శించు," అన్నాడు హరిస్వామి.

ఆ యువకుడు తన విజ్ఞానంతో ఒక విమానం తయారు చేసి ఉన్నాడు. అతను హరిస్వామిని అందులో ఎక్కించుకుని, ఆకాశమార్గాన లోకాలన్నీ తిప్పి తెచ్చాడు.

"భేష్, నీవు మా అమ్మాయికి తగిన వాడివే. ఇంకొక్క వారంలో ఉజ్జయినికి రా. ఆ నాడు పెళ్ళికి మంచి ముహూర్త మున్నది. నీకు మా అమ్మాయిని ఇచ్చి చేస్తాను," అని హరిస్వామి ఆ యువకుడికి మాట ఇచ్చాడు.

ఇది జరిగిన సమయంలోనే ఉజ్జయినిలో మరొక బ్రాహ్మణ యువకుడు హరిస్వామి కొడుకైన దేవస్వామి వద్దకు వచ్చి, "నాకు మీ చెల్లెలి నిచ్చి పెళ్ళి చేస్తారా?" అని అడిగాడు.

దేవస్వామి అతనితో, "గొప్ప శూరుడో, జ్ఞానో, విజ్ఞానో అయితే తప్ప మా చెల్లెలు పెళ్ళాడదు. నీవు దేనికిందికి వస్తావు?" అని అడిగాడు.

"నేను సమస్త శస్త్రాస్త్ర విద్యలలోనూ ఆరితేరిన శూరుణ్ణి," అంటూ ఆ యువ





కుడు తన విద్యాపాటవాన్ని దేవస్వామికి ప్రదర్శించి చూపాడు.

దేవస్వామి తృప్తిపడి అతనితో, "ఇంకొక వారానికి మంచి ముహూర్తం ఉన్నది. ఆ రోజున మా ఇంటికి వచ్చినట్టయితే నీకు మా చెల్లెలి నిచ్చి పెళ్ళిచేస్తాను," అన్నాడు.

ఆ రోజునే హరిస్వామి భార్య వద్దకు మరొక బ్రాహ్మణ యువకుడు వచ్చి, "అమ్మా, మీ కుమార్తెను నాకిచ్చి పెళ్ళి చెయ్యండి," అని అడిగాడు.

ఆమెకూడా అతనితో తన కుమార్తెకు గల నియమం తెలిపి, "నాయనా, నీవు శూరుడివా, జ్ఞానివా, విజ్ఞానివా?" అని అడిగింది.

"నేను జ్ఞానిని. ఈ క్షణాన ఎక్కడ ఏమి జరుగుతున్నదీ నేను తెలుసుకోగలను," అన్నాడు యువకుడు. ఆ సంగతి రుజువు చెయ్యటానికి అతను కొన్ని దృష్టాంతరాలు చూపాడు. సోమప్రభ తల్లి తృప్తిపడి అతనితో, "నాయనా, సరిగా ఒక వారానికి మంచి ముహూర్తం ఉన్నది. ఆనాడు మా ఇంటికి వచ్చావంటే నీకు మా అమ్మాయి నిచ్చి చేస్తా," అని చెప్పింది.

ఈవిధంగా హరిస్వామీ, దేవస్వామీ, అతని తల్లీ ఒకరికి తెలియకుండా ఒకరు సోమప్రభకు ముగ్గురు వరుళ్ళను ఏర్పాటు చేశారు. హరిస్వామి ఇంటికి తిరిగి వచ్చి తాను ఒక సంబంధానికి మాట ఇచ్చానని చెప్పగానే, మిగిలిన ఇద్దరూ తాముకూడా అలాగే చేశామని బయటపెట్టారు. ఈ చిక్కునుంచి ఎలా బయటపడటమా అని వారు చింతించసాగారు.

వారం తిరిగింది. ముహూర్తం రోజు వచ్చింది. ముగ్గురు పెళ్ళికొడుకులూ హరిస్వామి ఇంటికి వచ్చారు. ఈ సమస్య ఎలా పరిష్కరించటమా అనుకుంటుండగా సోమప్రభ కాస్తా మాయమయింది. ఆమెకోసం ఎన్నోచోట్ల వెతికారు. ఎంత వెతికినా ఆమె జాడ తెలియరాలేదు.

అప్పుడు పెళ్లికొడుకులలో జ్ఞాని అయిన వాణ్ణి హరిస్వామి, "ఓ జ్ఞానీ, నీకు నిజంగా జ్ఞానమే ఉంటే నా కూతురు ఏమయిందో చెప్పు," అని అడిగాడు.

"వింధ్యారణ్యంలో ఉండే ధూమశిఖుడనే రాక్షసుడు మీ కుమార్తెను ఎత్తుకు పోయాడు. ఆమె ఇప్పుడు వాడి ఇంట ఉన్నది," అని జ్ఞాని చెప్పాడు.

"అయ్యో, ఎక్కడి వింధ్యారణ్యం! అక్కడికి ఎలా వెళ్ళటం? వెళ్ళితేమటుకు దాన్ని రాక్షసుడి బారినుంచి తప్పించి ముహూర్తానికి పెళ్లిచెయ్యటం ఎలా?" అని హరిస్వామి మొత్తుకున్నాడు.

"మీరేం విచారించకండి. మన మందరమూ ఒక్క క్షణంలో మీ అమ్మాయి ఉన్న చోటికి వెళ్ళటానికి నా విమానం ఉన్నది," అన్నాడు విజ్ఞాని పెళ్ళికొడుకు.

అతని విమానంలో అందరూ ఎక్కారు. సమస్త శస్త్రాస్త్రాలతో శూరుడు కూడా ఎక్కాడు. క్షణంలో విమానం వింధ్యారణ్యం చేరుకుని ధూమశిఖుడి ఇంటి ముందు వాలింది. అందరూ విమానం నుంచి దిగారు.

ధూమశిఖుడు కారాలూ మిరియాలూ నూరుతూ వారిపైకి వచ్చాడు. శూరుడు తన అస్త్రశస్త్ర నైపుణ్యమంతా ప్రయోగించి,



ఆ రాక్షసుడితో పోరాడి, చివరకు ఒక అర్ధ చంద్రబాణంతో వాడి మెడ తెగవేశాడు. తరవాత అందరూ కలిసి సోమప్రభను తీసుకుని విమానంలో బయలుదేరి హరిస్వామి ఇంటికి తిరిగి వచ్చారు.

ముహూర్తం సమీపిస్తున్నది. కాని సోమప్రభను నేను పెళ్లాడతానంటే నేనంటూ ముగ్గురు పెళ్ళికొడుకులూ హరిస్వామి ముందు తయారయారు.

"సోమప్రభ ఎక్కడ ఉన్నదీ నేను చెప్పకపోతే మీకామె ఎట్లా దక్కేది? నేనే ఆమెను పెళ్ళాడాలి!" అన్నాడు జ్ఞాని.

"ఆమె ఎక్కడ ఉంటేమాత్రం నా విమానం లేకపోతే ఆమెను రక్షించటానికి అవకాశ మెక్కడిది? నేనే ఆమెను పెళ్లాడాలి!" అన్నాడు విజ్ఞాని.

"రాక్షసుణ్ణి చంపి ఆమెను రక్షించిన వాణ్ణి నేనుండగా మరొకరు ఆమెను ఎట్లా పెళ్లాడతారు?" అన్నాడు శూరుడు.

వీరి వాదనలలో ఎవరిది ఎక్కువ బలమైన వాదమో తెలియక హరిస్వామి తికమక పడ్డాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఆ ముగ్గురు పెళ్లికొడుకులలోనూ సోమప్రభను పెళ్ళాడటానికి ఎక్కువ అర్హత గలవాడెవడు? శూరుడా, జ్ఞానా, విజ్ఞానా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సోమప్రభను పెళ్ళాడటానికి నిజంగా అర్హుడు శూరుడే. అతడే తన ప్రాణాలు ఒడ్డి రాక్షసుడితో పోరి ఆమెను రక్షించాడు. జ్ఞానిగాని, విజ్ఞానిగాని అతనికి సహాయకులు మాత్రమే అవుతారు. జ్ఞానమూ, విజ్ఞానమూ సాధనలే గాని పరమార్థం ఎన్నడూ కావు," అని చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.





# ముజో కోసం

టర్కీలో ముజో అనేవాడుండేవాడు. వాడు చిన్నతనంలోనే చనిపోవటంచేత వాడి భార్య మళ్లీ పెళ్లి చేసుకున్నది. ఆమె రెండో భర్త కొంత డబ్బుగల రైతు. అయినా భార్యాభర్తలిద్దరూ స్వయంగానే పొలంపని చేసుకునేవారు.

ఒకనాడు వాళ్లు చెమటలు కక్కుతూ మిట్టమధ్యాన్నందాకా తమ జొన్నచేనులో పని చేశారు. భర్త అప్పుడు వంచిన నడుము ఎత్తి, "పెళ్లామా, పెళ్లామా, మిట్ట మధ్యాన మయింది. ఇక కూడు తినవచ్చు. నేను గుర్రానికి వాగులో నీళ్లు పెట్టి వస్తాను. నువు అందాకా ఆ గట్టుమీది చెట్టుకింద విశ్రాంతి తీసుకో!" అన్నాడు.

భార్య చెట్టుకిందికి పోయి చల్లని నీడలో చేరగిలబడి, "హమ్మయ్య!" అనుకుని క్షణంపాటు కన్ను మూసింది. అంతలోనే ఆమెకు, "ఏమమ్మోయ్!" అని పలకరించటం వినిపించింది. కళ్లు తెరిచి చూసే సరికి వింత దుస్తులు ధరించి, బొచ్చు టోపీ పెట్టుకున్నవాడొకడు ఎట్టెదుట కనిపించాడు.

"ఎవరయ్యా నువ్వూ? ఎక్కడినుంచి వస్తున్నావు?" అని అడిగింది ఆడమనిషి.

"మాది ఈ ప్రపంచం కాదులే," అన్నాడు కొత్తవాడు.

"ఇంకో లోకంనుంచి వచ్చావా? అయితే చూడూ, అక్కడ నా మొదటి మొగుడు ముజో కనిపించాడా? అతను పోయి ఎంతో కాలం కాలేదు," అన్నది ఆడది.

"ముజో తెలీకేం? రోజూ కలుస్తాం! మా ఇద్దరికీ మంచిస్నేహం. అదీగాక మా ఇళ్లు పక్కపక్కనే!" అన్నాడు కొత్తవాడు.

"నిజంగానా? అయితే అక్కడ సుఖంగా ఉంటుందా?" అని ఆడది అడిగింది.

"ఇక్కడున్నట్టే ఉంటుంది—కొంచెం అటూ ఇటూగా," అన్నాడు కొత్తవాడు.

డి. రామాచారి



"మరి మా ముజో సుఖంగా ఉన్నాడా?" అని ఆడది మళ్ళీ అడిగింది.

"సుఖంగా లేకేంగాని, డబ్బుకే బాగా ఇబ్బంది పడుతున్నాడు. కాఫీ కావాలన్నా, చుట్టముక్క కొనుక్కోవాలన్నా దగ్గిర ఎర్ర ఏగానీ లేదు. నాబోటి స్నేహితులు ఇప్పిస్తే బిడియపడతాడు," అన్నాడు కొత్తవాడు.

ఆడది రెండు కన్నీటి బొట్లు రాల్చి కొంగుతో కళ్లు తుడుచుకుని, "నువు మళ్లీ తిరిగి పోతున్నావా, నాయనా? డబ్బిస్తాను గానీ ముజోకు చేర్చుతావా?" అని అడిగింది.

"సంతోషంగా చేర్చుతాను. అదీ ఒక పెద్ద పనేనా ఏమిటి?" అన్నాడు కొత్తవాడు.

ఆడది లేచి వెళ్ళి పక్కనే మడత పెట్టి వున్న భర్త కోటుజేబులోనుంచి బంగారు కాసుల మూట తీసి కొత్తవాడి కిస్తూ, "దీన్ని మా ముజోకియ్యి. నేను బతికుండగా తనకు ఏలోటూ రానివ్వనని చెప్పు. నేను మళ్ళీ పెళ్ళి చేసుకున్నప్పటికీ ముజోను మరవ లేదని మరీ మరీ చెప్పు," అన్నది.

కొత్తవాడు ఆ డబ్బు తీసుకుని సాధ్యమైనంత శీఘ్రంగా వాగు ఒడ్డున వుండే పొదల మధ్యగా జారుకున్నాడు.

ఎందుకంటే ఆడదాని రెండో భర్త గుర్రాన్ని తీసుకుని చెట్టు దగ్గిరకు వస్తూ ఉండటం వాడికి కనిపించింది.

ఆడది మాత్రం కొత్తవాడు వెళ్లిన దిక్కే చూస్తూ తనభర్త దగ్గిరికి వచ్చినదాకా చూడనేలేదు.

"ఎవడా మనిషి? నీతో ఏం మాట్లాడుతున్నాడు?" అని భర్త అడిగాడు.

భార్య జరిగిన సమాచారమంతా చెప్పింది. అంతా విన్నాక రైతుకు పట్టరాని ఆగ్రహం పుట్టింది. కాని భార్యను తిట్టుతూ నిలబడిపోతే డబ్బు తీసుకున్న దొంగవెధవ తప్పించుకుపోతాడు.

"ఏడీ వాడూ? ఏ దిక్కుగా వెళ్లాడు?" అని రైతు భార్య నడిగి తెలుసుకుని తన

గుర్రంమీద ఎక్కి, దాన్ని దౌడు తీయిస్తూ కొత్తవాడు వెళ్లిన దారి పట్టుకున్నాడు.

వాగుకు కొంత ఎగువను ఒక పిండిమర ఉన్నది. కొత్తవాడు దాన్ని చేరవచ్చే సమయానికి రైతు గుర్రంమీద దౌడు తీస్తూ వచ్చే చప్పుడు వినిపించింది. వాడు చప్పున పిండిమరలోకి దూరాడు. లోపల మర తిరగలి రాళ్ల రొద హెచ్చుగా ఉన్నది. అందుచేత వాడు మర యజమానితో, "పారిపో, పారిపో! నిన్ను చంపటానికి తురకవాడు వస్తున్నాడు," అని అరిచాడు.

మర యజమాని తొంగి బయటికి చూసే సరికి, గుర్రాన్ని దౌడు తీయిస్తూ, చేత కత్తి పట్టుకుని వచ్చే రైతు కనిపించాడు. వాడు, "చచ్చాన్రా!" అనుకుని, తన టోపీ కొత్త వాడికిచ్చి, వాడి బొచ్చుటోపీ తాను పెట్టుకుని, తాను మెడకూ, నడుముకూ కట్టుకున్న గుడ్డకూడా వాడికిచ్చి, దొడ్డిదారిన పడి, మర వెనక ఉన్న గుట్టమీది అడవిలోకి పారిపోయాడు.

అదే సమయంలో రైతు మర బయట గుర్రాన్ని దిగి లోపలికి వచ్చాడు. కొత్తవాడు పిండిబస్తాలనుంచి ఇంత పిండి తన ఒంటి మీదా, చేతులకూ, ముఖానికీ పూసుకుని ఏదో తనిఖీ చేస్తున్నట్టు నటిస్తున్నాడు.



రైతు వాణ్ణి గుర్తించక, "ఇటుగా వచ్చినవాడు ఏమయాడు?" అని గట్టిగా అరిచాడు. మర మోతలో వినపడనట్టు నటించాడు కొత్తవాడు. రైతు దగ్గిరికి వచ్చి వాడి భుజంమీద చెయ్యి వేసి ఊపుతూ, "ఇప్పుడొక మనిషి లోపలికి రావటం చూశాను. వాడేడీ?" అన్నాడు మరింత గట్టిగా.

కొత్తవాడు దొడ్డి వాకిలి చూపి మళ్లీ తన పనిలో నిమగ్నుడైనట్టు నటించాడు. రైతు దొడ్డివాకిలి వద్దకు వెళ్లిచూస్తే, చెట్ల సందున పడి గుట్ట ఎక్కిపోతూ బొచ్చు టోపీవాడు కనబడ్డాడు. ఆ చెట్ల మధ్యగా గుర్రం వెళ్ళదు. అందుచేత రైతు, "ఒరేయ్, ఆగు!

నీ ప్రాణాలు తీస్తా!" అంటూ, కత్తి ఊపుతూ, రొప్పుతూ గుట్ట ఎక్కసాగాడు.

ఈ కేకలు విని మర యజమాని మరింత వేగంగా పరిగెత్తసాగాడు. ఆ పరిగెత్తే హడావుడిలో వాడు, ఒక పడిపోయిన చెట్టుకు కాలు తగిలి, కింద పడ్డాడు. వాడు మళ్ళీ లేచేలోగా రైతు వాణ్ణి పట్టుకున్నాడు.

"ఏదీ నా డబ్బు సంచీ? వెంటనే ఇచ్చెయ్యకపోయావో నిన్ను నరికి పోగువేస్తాను," అన్నాడు రైతు.

"ఏ డబ్బు సంచీ?" అన్నాడు మర యజమాని నిర్ఘాంతపోయి.

"నా పెళ్ళాన్ని వెర్రిదాన్ని చేసి, ముజోకు ఇస్తానని నువు తీసుకున్న సంచీ! వెంటనే ఇచ్చెయ్యి!" అన్నాడు రైతు.

"నీ భార్య ఎవరు? ముజో ఎవరు? నాకేమీ తెలీదు. వాడు వచ్చి భయపెట్టిన దాకా నేను నా పిండిమరలోనే ఉంటినిగా!" అన్నాడు మర యజమాని.

క్రమంగా నిజం బయటపడింది. రైతు తాను మోసపోయినందుకు విచారిస్తూ పిండిమర వద్దకు తిరిగి వచ్చేసరికి మర లోపల మనిషీ లేడు, బయట రైతు గుర్రమూ లేదు. కొత్తవాడు దాన్ని ఎక్కి అప్పుడే ఉడాయించేశాడు.

రైతు కాళ్ళీడ్చుకుంటూ భార్య ఉన్న చోటికి తిరిగి వచ్చాడు.

"తిండీ తిప్పలూ లేకుండా, మాటా పలుకూ ఆడకుండానే ఎక్కడికి వెళ్ళావు? అన్నట్టు నీ గుర్రం ఏదీ? నడిచి వచ్చావేం?" అని భార్య అడిగింది.

"గుర్రమా? పాపం, ముజో స్వర్గంలో కాళ్ళు అరిగేటట్టు నడుస్తున్నాట్ట. అందుకని వాడికి నా గుర్రం కూడా ఇవ్వమని ఆ వచ్చినవాడికి ఇచ్చేశాను!" అంటూ రైతు భోజనానికి కూచున్నాడు.

ఇద్దరూ మంచి ఆకలిమీద ఉండటం చేత భోజనం చక్కగా సయించింది.





# లంకె బిందెలు

ఒక జమీందారుగారి గ్రామంలో ఒక నిరుపేద రైతు ఉండేవాడు. వాడి దుస్థితి చూసి జమీందారు వాడికి కొద్దిపాటి బంజరుపొలం ఇచ్చి, బతికిఉన్నంత కాలమూ అనుభవించమన్నాడు.

ఒకనాడు రైతు తన చెక్క దున్నుతూ ఉండగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. తవ్వి చూస్తే లంకెబిందెలు కనబడ్డాయి. వాటినిండా బంగారుకాసులున్నాయి.

ఆ బిందెలను ఎలాగైనా, పరాయివాడి కన్ను పడకుండా, ఇంటికి చేర్చుకుంటే తన దరిద్రం తీరిపోతుంది. ఈ లంకెబిందెల మాట మరో ప్రాణి చెవిని పడిందో వాటిలో ఒక్క కాసుకూడా తనకు దక్కదు; అంతా జమీందారు చెవులుమెలేసి తీసుకుంటాడు.

అయితే ఆ బిందెలు చాలా బరువున్నాయి. తాను ఒక్కడూ వాటిని ఇంటికి చేర్చటం అసంభవం. తన భార్య కూడా సహాయపడాలి. కాని దానినోట నువుగింజ నానదు. అది వొట్టి వెర్రిబాగులది.

రైతు ఎంతోసేపు దీర్ఘంగా ఆలోచించి చివరకు కర్తవ్యం నిర్ణయించుకున్నాడు. చీకటిపడగానే వాడు కొన్ని చేపలూ, ఒక కోడీ కొన్నాడు. చేపలను తెచ్చి తన దొడ్లో ఉన్న ఉచ్చులలో పెట్టాడు, కోడిపెట్టను తీసుకుపోయి చెరువులో వేసిన వలలో పెట్టేశాడు. తరవాత ఖాళీచేతులతో ఇంట్లోకి వెళ్ళాడు.

"ఎప్పుడూ ఉత్తచేతు లాడించుకుంటూ వస్తావు. వంట ఏం చెయ్యను?" అని పెళ్లాం లబలబలాడింది.

"ఊరికే అరవకు. దొడ్లో ఉచ్చులు వేశాను. ఏమైనా పడ్డాయేమో చూద్దాం పద. చెరువులో వలవేసి వచ్చాను. అందులో కూడా ఏమైనా చిక్కి ఉండొచ్చు," అన్నాడు రైతు.

హెచ్. రమణరావు



ఇద్దరూ బయలుదేరారు. ఉచ్చుల్లో చేపలు దొరికాయి, వలలో కోడి చిక్కింది. "ఎంత చిత్రం! ఎంత చిత్రం!" అన్నది రైతు పెళ్ళాం.

"ఇదేం చూశావు? ఇంతకన్న చిత్రం చెబుతా విను. మన పొలంలో లంకెబిందెలు దొరికాయి. అర్ధరాత్రివేళ మనం పోయి వాటిని తెచ్చుకోవాలి. ఎవరికీ తెలీరాదు సుమా. తెలిస్తే ఆ బిందెల్లో ఉన్న బంగారం మనకు దక్కదు. జాగర్త!" అన్నాడు రైతు.

ఇద్దరూ చీకట్లోపడి పొలానికి వెళ్ళారు. అక్కడ ఒకచోట ఎర్రనీళ్ళూ, ఒక మండా సిద్ధంగా ఉంచాడు రైతు. ఆ చీకట్లో వాడు మండను ఎర్రనీళ్ళలో ముంచి తన పెళ్లాం మీద విదిలించాడు.

"వాన కురుస్తోందేమిటీ?" అంటూ పెళ్ళాం తల ఎత్తి చూసింది. ఎక్కడా చిన్న మబ్బుతునక కూడా లేదు. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి.

"మబ్బు లేకుండా వాన ఏమిటీ?" అన్నది రైతు పెళ్ళాం.

"మబ్బులేని వాన నెత్తురువాన! నీకు తెలీదా?" అన్నాడు రైతు.

"అట్టాగా?" అన్నది రైతు పెళ్ళాం ఆశ్చర్యంగా.

తరవాత ఇద్దరూ లంకెబిందెలు మోసుకుని ఇంటికి బయలుదేరారు. వాళ్లు జమీందారుగారి ఇంటి వెనకగా వచ్చేటప్పుడు రెండుమూడు ఆవులు మూలిగినట్టుగా అరిచాయి. "అదేమిటీ?" అన్నది రైతు పెళ్ళాం భయంతో.

"ఏం లేదులే. జమీందారుగారిని దయ్యాలు ఎత్తుకుపోయాయట. అందుకని నౌకర్లు ఏడుస్తున్నారు," అన్నాడు రైతు.

"అట్టాగా?" అన్నది రైతు పెళ్ళాం మళ్ళీ ఆశ్చర్యంగా.

మొగుడు పెళ్ళాలిద్దరూ ఏ విఘ్నమూ లేకుండా ఇల్లు చేరుకున్నారు. లంకెబిందె

లను ఒకచోట పాతిపెట్టారు. రైతు పెళ్ళాం అలిసి ఉండటంచేత వెంటనే నిద్రపోయింది. రైతుమాత్రం మేలుకుని ఉండి, లంకెబిందె లను మళ్లీ తవ్వి తీసి, బంగారం ఒకచోటా, బిందెలను మరొకచోటా పాతిపెట్టి తాను కూడా నిద్రపోయాడు.

తెల్లవారి లేస్తూనే పెళ్ళాం రైతుతో, "నాకు కాసిని కాసులిస్తావా? మంచి చీరెలూ, నగలూ కొనుక్కుంటాను. మనం ఇప్పుడు డబ్బుగలవాళ్ళం గదా!" అన్నది.

"పిచ్చిదానా, మనం ఎడాపెడా బంగారం వాడుతుంటే మన రహస్యం అందరికీ తెలిసిపోదూ?" అన్నాడు రైతు.

ఇద్దరూ మాటామాటా అనుకుని చివరకు పోట్లాడుకున్నారు. రైతు పెళ్ళాం బావి దగ్గిరకు వెళ్లి, పొరుగింటావిడ కనపడ్డ మరుక్షణమే, "నా మొగుడెంత పిసినిగొట్టో చూశావుటమ్మా?" అన్నది.

"ఎందుచేతా?" అన్నది పొరుగావిడ.

"మళ్ళీ ఎవరితోనూ అనమాకు. మాకు పొలంలో లంకెబిందెలు దొరికాయి. వాటి నిండా బంగారపు కాసులు! కోకలు కొంటానంటే నా మొగుడు ఒక్క కాసు ఇస్తే ఒట్టు!" అన్నది రైతు భార్య.

మళ్ళీ రాత్రిపడే లోపుగా లంకెబిందెల వార్త గ్రామంలో చాలామందికి తెలిసి



పోయింది. మరి రెండుమూడు రోజులకు ఈ మాట జమీందారుగారిదాకా వెళ్ళింది. ఆయన ఉగ్రుడై రైతుఇంటికి వచ్చి, "దుర్మార్గుడా! నమ్మకద్రోహీ! పాపంగదా అని నీకు పొలంచేసుకోమని ఇస్తే ఆ పొలంలో దొరికిన లంకెబిందెలు కాజేస్తావా? అవి నీ బాబుగాడి సొమ్మా?" అని రంకెలు పెట్టాడు.

రైతు లోపల బెదురుతున్నా పైకి తొణక కుండా, "లంకెబిందెలేమిటి, బాబూ? మీతో ఎవరన్నారూ?" అన్నాడు.

"నువ్వూ నీ పెళ్ళామూ కలిసి ఆ లంకె బిందెలను తెచ్చుకున్నారటగా? ఊళ్ళో అందరికీ అదే చెప్పిందిట!" అన్నాడు జమీందారు.

రైతు పెళ్ళాంకేసి చురచురా చూశాడు. ఆ పిచ్చిది మొగుడితో, "అట్టా చూస్తావేం? నువ్వూ నేనూ కలిసి లంకెబిందెలు పొలం నుంచి మోసుకురాలా? వాటినిండా బంగారపు కాసుల్లేవూ?" అన్నది.

"అదెప్పుడూ?" అన్నాడు రైతు ఆశ్చర్యం నటిస్తూ.

"నేను మరిచిపోయా ననుకున్నావా? ఆ రాత్రేగా మన ఊచ్చుల్లో చేపలు పడిందీ? చెరువులో వలేస్తే కోడి పడింది కూడానూ!" అన్నది భార్య. చుట్టూ మూగిన జనం ఈ పిచ్చి మాటలకు నవ్వసాగారు.

"ఏం నవ్వుతారు? ఆ రాత్రేగా మబ్బుల్లేకుండా నెత్తురువాన కురిసిందీ? అన్నట్టు అర్ధరాత్రివేళ జమీందారుగారిని దయ్యాలెత్తుకుపోతే నౌకర్లందరూ లబోమని ఏడిచారే!" అన్నది రైతు పెళ్ళాం.

"ఛీ, మతిమాలిన ముండా!" అని తిట్టి జమీందారు బయటికి వెళ్ళిపోయాడు. లంకెబిందెల పుకారు కూడా వట్టి పుకారే అని ఆయనకు రూఢి అయిపోయింది. చూడ వచ్చినవాళ్ళు కూడా, రైతు పెళ్ళాం చెప్పే ఒక్కమాటా నమ్మటానికి లేదనుకుంటూ ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.






అప్పుడే సుష్టుగా భోంచేసి తాతయ్య పిండార బోసినట్టున్న వెన్నెట్లో కుర్చీవేసుకు కూచుని, ఒక పట్టు పొడుం పీల్చి, ఇలా చదివాడు:

"ఆహారే వ్యవహారే చ
త్యక్తలజ్జః సుఖీ భవేత్;
అన్యథాస్యాత్ పరిభవీ
దుఃఖభాక్ చ నసంశయః"

తాతయ్య ఈ శ్లోకం చదివి, "అంటే ఏమిటో మీకు తెలుసునా?" అని చుట్టూ చేరిన పిల్లల్ని అడిగాడు.

"తెలీదు, తాతయ్యా!" "నువు చెప్పు, తాతయ్యా!" "కథ కూడా చెప్పు, తాతయ్యా!" అని పిల్లలు ఒక్కసారిగా మాట్లాడారు.

"ఉండండి, ఉండండి. ఆ శ్లోకానికి అర్థమేమిటంటే—భోజనం విషయంలోనూ, వ్యవహారం విషయంలోనూ సిగ్గుపడితే లాభం లేదు; ఎవరైనా బిడియపడతారో, వారికి తప్పకుండా అవమానమూ, కష్టమూ కలుగుతాయీ అని," అన్నాడు తాతయ్య.

"అన్నం తినటం దగ్గిర నాకేమీ సిగ్గు లేదు, తాతయ్యా. ఈ పూట కందిపచ్చడి భలే బాగుంది. అందుకని మూడుసార్లు అదే కలుపుకున్నా," అన్నాడొక అబ్బాయి.

"ఊరుకోరా, కందిపచ్చడీ.... నువు కథ చెప్పు, తాతయ్యా!" అన్నాడు ఇంకొకడు.

"కథ లేకేమ్రా? ఉంది! చెబుతాను వినండి," అంటూ తాతయ్య ఇలా చెప్పాడు:

ఒక ఊళ్ళో సుందరేశం అని ఒక అబ్బాయి ఉండేవాడు. వాడికి ఎక్కడ లేని బిడియమూ, సిగ్గూనూ. అయిందా? వాడికి పెళ్ళి అయింది. సరే, ఇంకేం? అత్తవారు వాణ్ణి మనుగుడుపులకు తీసుకుపోయారు.

మరి అత్తవారింట అందరూ కొత్తవాళ్ళే అయిరి. అసలే సుందరేశం బిడియస్తుడాయె. వాడికి ఎరిగినవాళ్ళదగ్గిరే ఎంతో సిగ్గు; కొత్త వాళ్ళదగ్గిర ఏంమాట్లాడతాడూ? ఎవరితోనూ

తాతయ్య కథలు:—7

రచన: సి. శేషాద్రి

కలవకుండా పెడపెడగా ఉండిపోయాడు. అత్తవారింట కొత్త అల్లుడి కోసం రకరకాల పిండివంటలు చేశారు. ఏది తినటానికీ సుందరేశానికి వల్లమాలిన మొహమాటం. వాడు వద్దు వద్దు అంటున్నా వాళ్లు వడ్డిస్తూనే వచ్చారు. వడ్డించినవి తినటానికి కూడా వాడికి బిడియమే.

ఒక పూట ఏమయిందో తెలుసా? అత్తగారు అందరికీ నువ్వులపిండి వడ్డిస్తూ అల్లుడికి కూడా వేయబోయింది. సుందరేశం చెయ్యి అడ్డంపెట్టి, మొహమాటంకొద్దీ, "వద్దు, వద్దు," అన్నాడు.

"అదేమిటి, నాయనా? శాస్త్రార్థం కొంచెం వేసుకో," అంటూ కొద్దిగా వడ్డించింది అత్తగారు.

సుందరేశం నువ్వులపిండి రుచి ఎరగడు. ఎలా ఉంటుందో చూద్దామని, తన విస్తట్లో వేసినది కాస్తా నోటికి రాచుకున్నాడు. అది అద్భుతంగా ఉంది!

"అయ్యో, ఇంకొంచెం వెయ్యమనక పోతినే," అనుకున్నాడు. నోరుతెరిచి అడగాలంటే చచ్చే సిగ్గు.

భోజనాలయాక అందరూ వెళ్ళి పడుకున్నారు. సుందరేశం నువ్వులపిండి ఎక్కడ ఉంటుందా అని ఇల్లంతా కారాడాడు.

ఇలా కారాడుతూ వాడు దొడ్లో రోటి దగ్గిరికి వెళ్ళేసరికి నువ్వులపిండి వాసన గుప్పున కొట్టింది. ఆ రోట్లోనే నువ్వులపిండి కొట్టారు. ఇకనేం? సుందరేశం రోట్లో తల దూర్చి రోలును ఆత్రంగా నాకసాగాడు. వాడి తల కాస్తా రోట్లో ఇరుక్కుపోయింది. ఎంత పెనగులాడినా తల ఊడి రాలేదు.

చివరకు నలుగురూ వచ్చారు. ఎలాగో కొత్త అల్లుణ్ణి రోటినుంచి తప్పించారనుకోండి. కాని అసలు సంగతి ఏమిటంటే, ఇంకొంచెం నువ్వులపిండి కావాలని అడగటానికి మొహమాటపడ్డవాడు పదిమంది లోనూ అవమానంపాలు కావలిసివచ్చింది!








## 2

మర్నాడు రాజు గగన సౌధానికి వెళ్లి చూసే సరికి, గడిచిన రాత్రి మళ్లీ ఎవరో అక్కడికి వచ్చి వెళ్ళారనీ, తన యోధులు ఆ మనిషిని పట్టుకోలేకపోయారనీ స్పష్టమయింది. రాజుకు కోపంతో నోట మాట రాలేదు.

ఈలోపల ఈ వృత్తాంతం నగరమంతా పాక్కింది. "విన్నావా? రాజుగారు గగన సౌధంలో దాచి ఉంచిన రాజకుమార్తె దగ్గిరికి ప్రతిరోజూ ఎవడో వచ్చి పోతున్నాడట! ఎంత అపఖ్యాతి!" అని పౌరులు ఒకరితో ఒకరు చెప్పుకో నారంభించారు. రాజుగారికి వీధిలోకి వెళ్లటానికూ్కడా మొహం చెల్లలేదు.

అయన తన మంత్రులలో చురుకైనవాణ్ణి పిలిపించి, "అమ్మాయిదగ్గిరికి వచ్చిపోతున్న ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోవటానికి ఏదైనా ఉపాయం ఆలోచించు," అని అడిగాడు.

"మహారాజా, గగన సౌధం అంతటా, అక్కడి సామగ్రిమీదా రంగు చల్లించండి. ఆ సౌధంలోకి ఎవడైనా వచ్చి క్షణంసేపు కూర్చున్నప్పటికీ వాడి బట్టలకు రంగు అంటుతుంది. ఆ తరవాత మనం నగరమంతా ఘాలించి ఆ దుర్మార్గుణ్ణి సులువుగా పట్టుకోవచ్చు," అని మంత్రి రాజుకు ఉపాయం చెప్పాడు.

ఈ ఉపాయం రాజుకు నచ్చింది. ఆ సాయంకాలం ఆయన గగన సౌధానికి వెళ్లి అక్కడ ఉండే కుర్చీలమీదా, మంచాల మీదా, అంతటా రంగు చల్లాడు.

న. మాధవరావు





ఎప్పటిలాగే రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధానికి వచ్చి తెల్లవార్లూ రాజకుమార్తెతో గడిపాడు. తెల్లవారబోతూండగా కొయ్యగుర్రంమీద నగరానికి దిగివస్తూ తన దుస్తులనిండా రంగు ఉండటం గమనించాడు. వెంటనే వాడు వాటిని ఊడదీసి కింద పారేశాడు. ఆ దుస్తులనిండా ముత్యాలూ రత్నాలూ కుట్టి ఉన్నప్పటికీ వాడు లక్ష్యపెట్టలేదు.

రాజకుమారుడు దిగిన నగరంలో ఒక పేద వృద్ధుడు ఉండేవాడు వాడు రోజూ చీకటి తోనే లేచి అందరినీ ఉదయపు ప్రార్థనలకు లేవగొట్టుతూ ఉండేవాడు. వాడు అలవాటు ప్రకారం తెల్లవారుఝామున వీధులవెంబడి తిరుగుతూ ఉండగా పైనుంచి ఏవో దుస్తులు పడటం కనిపించింది.

వాడు ఎక్కడలేని ఆశ్చర్యంతో వాటిని ఎత్తి చూసి చాలా మేలైన దుస్తులని గ్రహించి ఎంతో ఆనందం పొందాడు.

"నిశ్చయంగా భగవంతుడే నాకోసం వీటిని పడవేసి ఉంటాడు. బుద్ధెరిగినప్పటి నుంచీ ఆ భగవంతుడి సేవలోనేగదా నేను కాలం వెళ్ళబుచ్చుతున్నాను; అందుకని ఆయనకు నాపై అనుగ్రహం కలిగి ఉంటుంది!" అనుకున్నాడా వృద్ధుడు. వాడు వాటిని పట్టుకుని ఇంటికి వెళ్లిపోయాడు.

రోజూ సాయంకాలంవేళ నగర ప్రజలందరూ దేవాలయానికి వస్తారు. పేద వృద్ధుడు తనకు రానున్న కష్టాన్ని కొంచెం కూడా తెలుసుకోలేక, భగవంతుడు తనకు ప్రసాదించిన దుస్తులు ధరించి, అందరిలాగే తానుకూడా దేవాలయానికి వెళ్ళాడు.

ఎవరి బట్టలకు రంగు అంటిందో అని చూస్తూ రాజభటులు అక్కడే తారట్లాడుతున్నారు. వాళ్ళ కళ్ళు ఈ వృద్ధుడిపై పడ్డాయి. వాడు తనమానాన తాను దైవ ధ్యానం చేసుకుంటున్నాడు. వాడి బట్టలకు అంటిన రంగు గమనించి రాజభటులు వాణ్ణి





ధ్యానిస్తున్నపాళంగానే పట్టుకుని రాజుగారి దగ్గిరికి లాక్కుపోయారు.

వృద్ధుణ్ణీ, వాడి ఒంటిపైన ఉన్న దుస్తులకు అంటిన రంగునూ చూడగానే రాజు రక్తం ఉడికిపోయింది. ఆయన అతనితో, "నీ బట్టలకు ఈ రంగు ఎలా అంటింది?" అని అడిగాడు.

"నా కవి వీధిలో దొరికినప్పుడే వాటికి రంగు అంటి ఉన్నది, మహారాజా!" అన్నాడు వృద్ధుడు.

రాజు వాడి మాటలు నమ్మక వాణ్ణి జైలుకు పంపించాడు. అక్కడి అధికారులు వృద్ధుణ్ణి హింసించి, బలాత్కారంగా నేరం చేసినట్టు వాడిచేత ఒప్పించారు. తరవాత వాడి చేతులకు బేడీలు తగిలించి ఉరితీయటానికి రచ్చకూడలికి తీసుకువెళ్ళారు.

ఈ నేరస్థుణ్ణీ, వాడికి జరిగే శిక్షనూ కళ్ళారా చూడటానికి జనం వేలకువేలుగా ఎగబడ్డారు. రాజకుమార్తె వద్దకు ఎవడో రహస్యంగా వచ్చి పోతున్నట్టు అదివరకే నగరమంతా పాక్కిపోయింది. ఇప్పుడా మనిషి దొరికిపోయినట్టు అందరికీ తెలిసింది. రాజకుమార్తెలాంటి అపురూప సుందరిని సమ్మోహింపజేసినవాడు ఎలా ఉంటాడో చూడాలని ప్రజలు తహతహలాడారు.




తీరా చూడబోతే పట్టుబడినవాడు ముసలివాడు. వాణ్ణి అందరూ ఎరుగుదురు. ఆ వృద్ధుడు రోజూ రహస్యంగా గగనసౌధానికి వెళ్ళి, రాత్రి అంతా రాజకుమార్తెతో గడిపి వస్తున్నాడంటే జనానికి నమ్మకం కలగలేదు.

వాణ్ణి ఉరితీయటం హత్యే తప్ప మరేమీ కాదని వారు అనుకున్నారు.

రాజకుమార్తె ప్రియుడు దొరకాడనీ, వాడు తన నేరం ఒప్పుకున్నాడనీ, వాడికి ఉరిశిక్ష విధించి రచ్చకూడలిలో ఉరితీయబోతున్నారనీ జనం అనుకోవటం రాజకుమారుడి చెవుల పడింది. వాడు వెంటనే






తన కొయ్యగుర్రాన్ని చంకనబెట్టుకుని రచ్చ కూడలికి పరిగెత్తాడు. వాడు చేరేసరికి వృద్ధుడి మెడకు ఉచ్చుకూడా తగిలించారు.

"ఉరి తీయకండి! వాడు నిరపరాధి! గగన సౌధానికి వెళ్ళి రాజకుమార్తెతో ఉంటున్నవాణ్ణి నేను. వృద్ధుడిపైన ఉన్న దుస్తులు నావే. కావలిస్తే నన్ను చంపండి. వాణ్ణిమాత్రం వెంటనే విడిచిపుచ్చండి!" అని రాజకుమారుడు కేకలుపెట్టాడు.

కొత్వాలు ఉరి నిలుపుచేయించి రాజు దగ్గిరికి ఒక మనిషిని పంపాడు. ఆ మనిషి వెళ్ళి రాజుతో, "మహారాజా, రచ్చకూడలికి ఒక యువకుడు వచ్చి తానే దోషినంటు



న్నాడు. ఎవరిని ఉరితీయాలో సెలవిప్పించండి!" అన్నాడు.

"నేరం ఒప్పుకున్న యువకుణ్ణే ఉరి తియ్యండి," అన్నాడు రాజు. నేరం ఒప్పుకున్నవాడు యువకుడని విన్నాక, వృద్ధుడు దోషి అయి ఉండటం అసంభవమని ఆయనకు కూడా రూఢి అయింది.

రాజుగారి అనుమతి అందగానే కొత్వాలు వృద్ధుడి మెడకు తగిలించిన ఉచ్చు తీసి, వాణ్ణి వదిలిపెట్టాడు తరవాత ఆయన రాజకుమారుణ్ణి పట్టుకోమని తన భటులను ఆజ్ఞాపించాడు.

వాళ్లు తనదగ్గిరికి వచ్చేలోపుగా రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని కిందపెట్టి, దానిపై కూచుని, మరలు వదులుచేసి, అందరూ చూస్తుండగానే ఆకాశంలోకి లేచి పోయాడు. ఈ దృశ్యాన్ని దూరంనుంచి కళ్లారా చూస్తున్న రాజుకు భరించరానంత కోపం వచ్చి, స్పృహతప్పి పడిపోయాడు.

రాజకుమారుడు సరాసరి గగన సౌధానికి వెళ్లాడు. వాడు రాజకుమార్తెను కలుసుకుని, "మన ప్రేమ రాను రాను ప్రాణాంతకంగా పరిణమిస్తున్నది. నన్ను విడిచి నువు ఉండలేవు, నిన్ను విడిచి నేనూ ఉండలేను. మన రహస్యం మీ తండ్రికి తెలిసిపోయింది



గనక, ఆయన నన్ను నగరంలో ఎక్కడ ఉన్నా వేటాడుతాడు. ఈ ఆపద తప్పించు కోవాలంటే ఒకటే మార్గం. నువుకూడా నావెంట మా దేశానికి వచ్చెయ్యి. మా వాళ్లు నిన్ను చూసి తప్పక సంతోషిస్తారు!" అన్నాడు.

"నిన్ను వదిలిపెట్టనని నేను అదివరకే నిశ్చయించుకున్నాను. నీవు ఎక్కడికి పోయినా నేను నీ వెంట వస్తాను. దాన్ని గురించి వేరే ఆలోచించవలిసిన పనిలేదు," అన్నది రాజకుమార్తె.

ఇద్దరూ గగన సౌధం వెలపలికి వచ్చి, కొయ్యగుర్రంపైన ఎక్కి కూచుని ఆకాశ మార్గాన ప్రయాణమయారు.

వాళ్ళు ఎన్నో నదులూ, కొండలూ, అడవులూ దాటి ఒక ఎడారిమీదుగా ఎగిరిపోతూ ఉండగా రాజకుమార్తె, "అరెరే, పెద్ద పొరపాటు జరిగిపోయింది. మనం మళ్లీ వెనక్కు వెళ్ళాలి!" అన్నది.

"వెనక్కు వెళ్ళటం దేనికి?" అన్నాడు రాజకుమారుడు.

"నా చిన్నతనంలో మా అమ్మ నాకు రెండు ఆభరణాలిచ్చింది. నేను పెద్దదాన్నయి పెళ్ళాడే సమయంలో వాటిని నా అత్తమామలకు కానుకలుగా ఇవ్వవలిసి ఉంటుందని ఆవిడ నాతో చెప్పింది. వాటిని తొందరలో మరిచిపోయి వచ్చేశాను.





మీ ఊరికి అవి లేకుండా ఎలా పోవటం?" అన్నది రాజకుమార్తె.

"ఈ భాగ్యానికేనా? ఆ ఆభరణాలు లేక పోతే మానేలే! మనం చాలా దూరం వచ్చేశాం," అన్నాడు రాజకుమారుడు.

"లేదు, లేదు. అవి లేకుండా నేను రాను. పెళ్లికి అత్తమామలకు కట్నా లివ్వక పోయానో నాకు బతికున్నంత కాలమూ తల వంపులుగానే ఉంటుంది," అన్నది రాజకుమార్తె.

ఆమె మనసును బాధపెట్టటం ఇష్టంలేక రాజకుమారుడు మరలు బిగించి గుర్రాన్ని నేలపై దించాడు. అతను ఆమెతో, "నీకోసం నే నిక్కడనే వేచి ఉంటాను. నీవు గుర్రం మీద వెళ్లి, ఆ ఆభరణాలు తీసుకుని, ఇక్కడ ఉన్నట్టుగా తిరిగిరా!" అన్నాడు.

రాజకుమార్తె సరేనని కొయ్యగుర్రంమీద ఎక్కి వచ్చిన దారినే గగన సౌధానికి తిరిగి పోయింది.

ఈలోపల అక్కడ స్పృహతప్పి పడి పోయిన రాజుగారికి మంత్రులు శైత్యోపచారాలు చేసి తెలివి తెప్పించారు. స్పృహ తెలుస్తూనే ఆయనకు తన కుమార్తె మాట జ్ఞాపకం వచ్చింది. ఆయన ఆదరాబాదరా బయలుదేరి గగన సౌధానికి వెళ్లాడు. ఎంత వెతికినా ఆయనకు రాజకుమార్తె కనిపించ లేదు. పిట్ట ఎగిరిపోయింది. గగన సౌధం ఖాళీ పంజరంలాగా ఉంది.

ఆయన ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తూ మతిపోయి కూచుని ఉండగా అంత దూరాన రాజకుమార్తె ఆకాశంలో కనిపించింది. ఆమె తన అభరణాలకోసం గగన సౌధానికి ఒంటరిగా కొయ్యగుర్రం మీద తిరిగి వస్తున్నది. రాజు ఒక మంచం వెనక దాక్కుని, రాజకుమార్తె లోపలికి అడుగు పెట్టగానే చప్పున ఇవతలికి దూకి, పట్టుకుని, ఆమెను గగన సౌధం నుంచి తన భవనానికి తీసుకువెళ్ళాడు.

రాజు ఇదివరకల్లా తనకుమార్తె పెళ్లి గురించి ఎంత తాత్సారం చేస్తూ వచ్చాడో ఇప్పుడు ఆమెకు పెళ్లి చెయ్యాలని అంత తహతహ లాడిపోయాడు. కాని ఆమెను ఎవరు పెళ్లాడతారు. ఆమెపై పుట్టిన ప్రవాదు ఆ చుట్టుపక్కల అంతటా వ్యాపించింది. ఆ ప్రాంతాల గల గౌరవ కుటుంబాలలో వాళ్లెవరూ ఆమె ఎత్తు ధనం పోసినా ఆమెను పెళ్లాడరు.

కాని దూరదేశపు రాజుకు ఒక కొడుకున్నాడు. ఆ రాజు రాజకుమార్తె అందచందాలను గురించి ఘనంగా విని ఒకప్పుడు ఈ రాజుకు రాయబారం పంపి, "మా అబ్బాయికి మీ అమ్మాయిని ఇచ్చి పెళ్లిచేస్తారా?" అని కబురు చేశాడు.

అప్పట్లో ఈ రాజుకు తన కుమార్తె పెళ్లి ఆలోచన ఏకోశానా లేనందున, "మా అమ్మాయి కింకా పెళ్లీడు రాలేదు. అందుచేత ఇప్పుడప్పుడే ఆమెకు పెళ్లిచేసే ఉద్దేశం మాకు లేదు," అని దూరదేశపు రాజుకు జవాబు చెప్పాడు.

రాజుకు ఇప్పుడా సంగతి జ్ఞాపకం వచ్చింది. తన కూతురి అపఖ్యాతి అంత దూరం వెళ్ళి ఉండదు. ఆమెనిచ్చి పెళ్ళి చేస్తానంటే ఎగిరి గంతేసి వస్తారు. అందుకని రాజు ఆ దూరదేశపు రాజుకు ఇలా వర్తమానం చేశాడు: "మీరు ఒకప్పుడు మా అమ్మాయిని మీ అబ్బాయికిచ్చి పెళ్లి చెయ్యమని కోరి ఉన్నారు. అప్పటికి మా అమ్మాయికి పెళ్లియీడు రానందున అలా చేయలేకపోయాము. ఇప్పుడు మా అమ్మాయికి వివాహవయసు వచ్చింది. మీ అబ్బాయిని మా నగరానికి పంపినట్టయితే మా అమ్మాయినిచ్చి పెళ్లిచేసి పంపగలము. ఈ వివాహంద్వారా మనం బంధువుల మవుతాము గనక మన రెండు దేశాల మధ్యా స్నేహసంబంధాలు బలపడగలవు."

—(ఇంకా వుంది)





# కాజీగారి పాజీ

ఒక సుల్తానుగారు ఒక కాజీకి పెద్ద పదవి ఇవ్వాలని నిశ్చయించి ఆయనను పిలిపించాడు. కాజీ వచ్చి సుల్తానుగారిని, "ఏమి సెలవు?" అని అడిగాడు.

"నేను మీకు ఒక పెద్ద పదవి ఇవ్వ నిశ్చయించాను. కాని ఆ పదవికి మీరు అర్హులో కారో నిర్ణయించటానికి మూడు ప్రశ్నలు అడుగుతాను. వాటికి సమాధానాలివ్వాలి," అన్నాడు సుల్తాను. ఆ మూడు ప్రశ్నలూ ఏమిటని కాజీ అడిగాడు.

"ఈశ్వరుడు ఉండే చోటు ఏది? ఆయన ఏ దిక్కుగా చూస్తూ ఉంటాడు? ఆయన ఏం చేస్తూ ఉంటాడు? ఈ మూడు ప్రశ్నలకూ మీరిచ్చే సమాధానాలు తృప్తికరంగా ఉంటే పెద్ద ఉద్యోగం ఇస్తాను. సరిగా లేని పక్షంలో కఠినంగా శిక్షిస్తాను," అన్నాడు సుల్తాను.

'ఎంతో గడ్డుప్రశ్న లైతేగాని సుల్తాను వాటిని తనకు ఇవ్వడు. అందుచేత కాజీ వారంరోజులు గడువు కోరి ఇంటికి వచ్చేశాడు. అహోరాత్రాలు ఆలోచించినప్పటికీ కాజీకి ఆ ప్రశ్నల మర్మం అర్థంకాలేదు.

వారంరోజులూ ఇట్టె గడిచిపోయాయి. కాజీ తన నౌకరైన పాజీని పిలిచి, "ఒరే నాకు సుస్తిగా ఉన్నదనీ, కాస్త నిమ్మళించగానే దర్శనం చేసుకుంటాననీ సుల్తానుగారితో చెప్పి రా!" అని చెప్పాడు. ఈ వంక పెట్టి తన గడువు పెంచుకుందామని కాజీ ఉద్దేశం.

"తమకు అకస్మాత్తుగా జబ్బుచెయ్యటానికి కారణమేమిటి?" అన్నాడు పాజీ.

"అసలే చస్తుంటే మధ్య నీ గొడవేమిటి?" అని కాజీ విసుక్కున్నాడు. కాని పాజీ వదలక జరిగినదంతా చెప్పించుకున్నాడు. వాడు అంతా విని, "ఈ ప్రశ్నలకు సమాధానాలు నాకు తెలుసు. ఒక కాగితంముక్క రాసి ఇచ్చారంటే మీ తర

స్వామి రామతీర్థ

పున నేను వెళ్ళి సమాధానాలు చెబుతాను. అవి సుల్తానుకు నచ్చకపోతే నా తలే పోతుంది!" అన్నాడు.

కాజీ అప్రకారమే పాజీని సుల్తాను వద్దకు పంపాడు. సుల్తాను కాజీ రాసిన చీటీ చదువుకుని, "కాజీని నేనడిగిన ప్రశ్నలకు నీవు సమాధానం చెప్పగలవా?" అన్నాడు.

"చెప్పగలను. కాని తమ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పేటప్పుడు నేను గురువు నవుతాను, తమరు నాకు శిష్యుడవుతారు!" అన్నాడు పాజీ.

సుల్తాను వాడిని తన సింహాసనం మీద కూచోబెట్టి సమాధానాలు చెప్పమన్నాడు.

"ఈశ్వరుడు ఉండే చోటు ఏది? ఇది మొదటి ప్రశ్న. పాలలో వెన్న ఉంటుందని మనకు తెలుసు. కాని పాలలో ఏభాగంలో అది ఉంటుంది? పాల అంతటా ఉంటుంది. ఈశ్వరుడూ అంతే!...ఈశ్వరుడు ఎటుగా చూస్తూ ఉంటాడు? వెలిగించిన దీపం ఎటుగా చూస్తుంది? అన్ని వైపులా చూస్తుంది. ఈశ్వరుడు కూడా అంతే —అన్నివైపులా సమంగా చూస్తూ ఉంటాడు. ఇక, ఈశ్వరుడు ఏంచేస్తూ ఉంటాడన్నది ఆఖరు ప్రశ్న. కాజీగారిని పిలిపించండి. ఆ ప్రశ్నకు కూడా సమాధానం చెబుతాను," అన్నాడు పాజీ. పాజీ సమాధానాలు సుల్తానుకు నచ్చాయి. పాజీయే ఇంత జ్ఞాని అయితే కాజీ ఇంకెంత జ్ఞానో అని ఆయన ఆశ్చర్యపడుతూ కాజీకోసం మనుషులను పంపాడు.

కాజీ వచ్చి చూసేసరికి పాజీ సుల్తానుగారి సింహాసనంపై కూర్చొని ఉన్నాడు. సుల్తాను తాను కూచోదగిన ఆసనంపైన ఉన్నాడు. కాజీని నౌకర్లు కూచునే స్థానంలో కూచోమని పాజీ ఆజ్ఞాపించి, "ఈశ్వరుడు చేసే పని కూడా ఇదే: సుల్తానును కాజీ చేస్తాడు, కాజీని పాజీ చేస్తాడు, పాజీని సుల్తాను చేస్తాడు!" అన్నాడు.

సుల్తాను ఎంతో సంతోషించాడు.





# రైతు పెట్టుకున్న అర్జీ

ఒక ఊళ్ళో ఒక పేద రైతుండేవాడు. వాడికి ఉన్న ఆస్తి ఒక ఒక్క ఆవు మాత్రమే. దాన్ని మేపుకునేటందుకు కూడా పేద రైతుకు అవకాశం లేకనే అది అలా చిక్కిపోయింది. ఆ ఆవును రైతు తన దొడ్లోనే కట్టిపెట్టి గడ్డిపరకలు మెయ్యనిచ్చేవాడు.

పేదరైతు దొడ్డిని అనుకునే ఒక పెద్ద భూస్వామి ఆవరణ ఉన్నది. ఆ ఆవరణలో పశువుల మేత గడ్డి ఏపుగా పెరిగి ఆవుకు కమ్మని వాసన తగిలింది. అది రెండిళ్ళ మధ్యా ఉన్న కంచెలో గల కంతనుంచి భూస్వామి ఆవరణలోకి దూకి అక్కడి గడ్డి మెయ్యసాగింది.

ఇది చూసి భూస్వామి నౌకరు ఒక దుడ్డు కర్ర తెచ్చి ఆవు తల పగలకొట్టాడు. ఒక్క దెబ్బకే అదికాస్తా చచ్చిఊరుకుంది.

రైతు భూస్వామి వద్దకు పరిగెత్తి తనకు జరిగిన అన్యాయం గురించి మొరపెట్టుకున్నాడు. భూస్వామి ఆ రైతు చెప్పిన మాటలూ, తన నౌకరు చెప్పిన మాటలూ విని, "ఏ ఆవును ఊళ్లోవాళ్ల దొడ్లమీదికి తోలటమే గాక అన్యాయం జరిగిందంటావా?... వీణ్ణి మన ఇంటి బయటి గుంజకు కట్టి పది దెబ్బలు కొట్టి పంపించు," అని తన నౌకరుతో అన్నాడు.

పేదరైతు ఆవును కోల్పోవటమే గాక భూస్వామి నౌకరుచేత దెబ్బలుకూడా పడి ఇంటికి వచ్చి అంతా తన భార్యతో చెప్పాడు.

"భూస్వామి మనకు న్యాయం చెయ్యకపోతే అగుతుందా ఏమిటి? నువు వెళ్ళి ఏకంగా రాజుగారికే ఫిర్యాదు చెయ్యి. రాజుగారు అన్యాయం జరగనివ్వడు. మనకు న్యాయం చేస్తాడు," అన్నది రైతు భార్య.

అయితే రాజుగారికి జరిగినదంతా స్పష్టంగా నివేదించటమెలాగ? అర్జీలు రాసుకునేటందుకు ఆ భార్యాభర్తలు చదువు

ఎస్. సుశీల



తున్నవాళ్ళు కారు. అందుచేత వాళ్ళు ఒక కొయ్యపలక తెచ్చి దానిమీద ఒక బొమ్మ గీశారు. అందులో రైతు ఇల్లూ, భూస్వామి ఇల్లూ, మధ్య ఉన్న కంచే, ఆ కంచెలో కంతా, భూస్వామి నౌకరు ఆవును చంపిన చోటూ, ఆ నౌకరే రైతును కొట్టటానికి కట్టేసిన గుంజా, అన్నీ గుర్తులు పెట్టారు.

"భేష్, ఇది చూస్తే రాజుగారికి జరిగినదంతా అరటిపండు వొలిచిపెట్టినట్టు అర్థమవుతుంది. నీకు దారిలో తినటానికి రొట్టెలు మూటగట్టి ఇస్తాను. నువు రాజుగారి నగరానికి బయలుదేరు," అన్నది రైతు భార్య.



రైతు బయలుదేరి మధ్యాన్నానికల్లా ఒక వనంలో ప్రవేశించాడు. అది రాజుగారి వనం. ఆ వనంలో రైతుకు ఒక మనిషి కనిపించాడు. ఆ మనిషి రాజుగారే. అయితే ఆయన మామూలు దుస్తులతో ఉండటంచేత రైతు ఆయనను చూసి రాజనుకోలేదు.

"దణ్ణాలు, బాబూ!" అన్నాడు రైతు.

"శుభం కలగాలి. ఎవరు నువు? ఎక్కడికి నీ ప్రయాణం?" అని రాజు అడిగాడు.

"ఏముందీ? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేసుకుందామని వెళుతున్నా. ఇదుగో, అర్జీ నా వీపున కట్టుకున్నా. నా ఆవును అన్యాయంగా చంపారులే! ఆకలి మండిపోతున్నది. కాస్త ఈ రొట్టెముక్క తిన్నాక అంతా చెబుతా!" అన్నాడు రైతు.

ఒక వాగు పక్కన రాజూ, రైతూ చతికిలబడి కూచున్నారు. రైతు తాను తెచ్చుకున్న రొట్టెలోనూ, వెన్నలోనూ సగం రాజుకిచ్చాడు. ఇద్దరూ తినటం ముగించి, వాగులో ఇంత చల్లని నీరు తాగారు.

"ఏదీ, నీ అర్జీ!" అన్నాడు రాజు.

రైతు తాను తయారుచేసుకువచ్చిన పలక తీసి, "ఇదుగో, ఇది మా యిల్లు. ఈ ఇల్లు భూస్వామిది. ఇది కంచె. ఇక్కడ కంత ఉన్నది. ఈ కంతలోనుంచి మా ఆవు



దూరి వారి ఆవరణలో ప్రవేశించింది. ఇక్కడ భూస్వామిగారి మనిషి మా అవును దుడ్డుకర్రతో కొట్టి చంపాడు. ఇంత అన్యాయమా అని నేను పోయి భూస్వామితో మొరపెట్టుకుంటే, ఇదుగో, ఈ గుంజకే నన్ను కట్టేసి పది దెబ్బలు కొట్టి, దిక్కున్న చోట చెప్పుకోమన్నారు," అంటూ అంతా వివరించాడు.

"ఇంకేం? దీన్ని నాకు చూపించినట్టే రాజుగారికీ చూపించు. నీకు న్యాయం జరుగుతుందిలే. ఇక నేను వస్తా!" అంటూ రాజు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.



రైతు మర్నాడు తన అర్జీపలక పట్టుకుని దర్బారుకు వెళ్ళాడు. దర్బారులో రాజుగారు కిరీటమూ, ఇతర రాజలాంఛనాలూ ధరించి ఎత్తుగా బంగారు సింహాసనంపై కూర్చుని ఉన్నాడు. ఆయన పక్కనే వరసగా పన్నెండుమంది మంత్రులు కూచుని ఉన్నారు.

రాజును గుర్తించక రైతు అర్జీపలకను చివర కూర్చున్న మంత్రికిచ్చి, "అయ్యా, ఈ అర్జీ చిత్తగించండి. భూస్వామిగారి మనిషి నా అవును చంపటమూ, నన్ను గుంజకు కట్టి కొట్టటమూ, అంతా ఇందులో ఉంది. చిత్తగించండి!" అన్నాడు.

మంత్రి ఆ పలకను ఎగాదిగా చూసి, "ఇదేమిటో నాకు కొంచెంకూడా బోధపడటంలేదు. ఇదేమి అర్జీ?" అంటూ దాన్ని తన పక్కన ఉన్న మంత్రికి ఇచ్చాడు.

ఆ మంత్రి కూడా పలకను ఎగాదిగా చూసి, "ఇది అర్జీ కాదు. ఈ వెర్రివాణ్ణి బయటికి గెంటండి!" అన్నాడు.

అంతలో రాజుగారు కలగజేసుకుని, "దాన్ని నాకు పంపండి," అన్నాడు. రైతు తెచ్చిన అర్జీపలక ఒక్కొక్క మంత్రే అందుకుని చూసి, తల అడ్డంగా తిప్పి, తన పక్కవాడికి ఇచ్చాడు. చివరకు ఆ అర్జీపలక రాజుగారికి చేరింది.

ఆయన దానికేసి చూసి, "ఇది అర్థమవుతూనే ఉన్నది .. ఏమోయ్, ఇలా రా!" అని రైతును పిలిచాడు.

"ఇది నీ ఇల్లూ, ఇది భూస్వామి ఇల్లూనూ. అవునా?" అని రాజు అడిగాడు.

"చిత్తం," అన్నాడు రైతు.

"ఇది కంచెలో కంతలాగుంది. ఇందులో నుంచేగదా నీ అవు భూస్వామి ఆవరణలో జొరబడింది?" అన్నాడు రాజు.

"మరేనండి!" అన్నాడు రైతు.

"మిగిలిందికూడా తెలుస్తూనే ఉంది. భూస్వామి మనిషి ఇక్కడ నీ అవును చంపి ఉంటాడు. నిన్ను ఈ గుంజకు కట్టి కర్రతో కొట్టి ఉంటారు," అన్నాడు రాజు.

"తమరు ఉన్న సంగతి సరిగా కనిపెట్టారండి," అన్నాడు రైతు దిగులుగా.

"సరే, నువ్వు మీ ఇంటికి తిరిగి వెళ్ళి, నేను న్యాయం చేస్తానని నీ భార్యతో చెప్పు!" అన్నాడు రాజు.

రైతు రాజుగారికి దణ్ణాలు పెట్టి, మంత్రులకేసి కోపంగా చూసి ఇంటికి వచ్చేశాడు.

ఆ సమయానికే రాజుగారి తీర్పుకూడా భూస్వామికి అందింది. భూస్వామి రైతుకు క్షమాపణలు చెప్పుకోవటమే గాక, ఒక ఇల్లూ, పశువుల సావడీ కట్టించి, ముప్పై కుంటల పొలమూ, ఏడు పాడి ఆవులూ ఇచ్చుకునేటట్టు రాజుగారు తీర్పు ఇచ్చాడు.

"రాజుగారు మనకు న్యాయం చేస్తాడని నేను చెప్పానా లేవా?" అన్నది రైతుభార్య.

"రాజుగారికేం? ఆయన ఎంత తెలివైనవాడు! మనం తయారుచేసిన అర్జీ చూస్తూనే అంతా తెలుసుకున్నాడు. కాని ఆయన దగ్గిర పన్నెండుమంది ఉన్నారు—వట్టి మట్టిబుర్రలు! అంత తెలివిగలవాడు చవటలను జీతం ఇచ్చి ఎందుకు పెట్టుకున్నాడో అర్థంకావటంలేదు!" అన్నాడు రైతు ఆశ్చర్యంతో.





"నే చెప్పినట్టు తలుపులూ కిటికీలూ బార్లాతీసి పడుకున్నారా, రాత్రి? ఆ గాలికి మీ తలనొప్పికాస్తా పోయివుంటుందే!"

"తలనొప్పి వుందిగానండీ, నా రిస్టువాచీ, మనీపర్సూ పోయాయండి."



"నేను జేబులో చిల్లిగవ్వ లేకండా జీవితంలో అడుగెట్టానంటే నమ్మండి!"

"నే పుట్టినపుడు జేబే లేకుండా పుట్టాను- ఎక్కడికి దీనికి?"



"ఏవయ్యా, ఈ తలనూనె రాస్తే జుట్టు మొలుస్తుందంటావా?"

"అమ్మమ్మ— ఎంతమాట! గారంటీ, బాబూ—మీరు మర్నాటికి మళ్లీ వెతుక్కోకుండా ఓ దువ్వెన ప్రతి బుడ్డితోబాటూ వూరికే ఇస్తూంటే ...!"




"కళ్ళు సరిగా కనపట్టంలేదంటారా—ఆ పటంమీద ఎన్ని లైన్లు చదవగలరు? చపవండి"

"లైన్ల సంగతి దేవుడెరుగు! అసలు పటం ఎక్కడున్నదంటారు?"

ఎస్. శంకరనారాయణ, మద్రాసు.




1. యం. ప్రసాదు, రాయచోటి

బలరామునికి శశిరేఖ అనే కుమార్తెకూడా లేదని మీరు [డిసెంబరు] బదులిచ్చియున్నారు. "పూర్వగాథాలహరి" 298 పేజీలో బలరాముని కూతురు శశిరేఖ యని వ్రాసియున్నది. మీ రేమంటారు?

మాదే పొరపాటు.

2. ఏ. వి. బి. కృష్ణారావు, రాయఘడ

అన్నయ్యా, చాచా నెహ్రూకి నోబెల్ బహుమానం ఎందుకిచ్చారండీ?

ఇంకా ఇవ్వలేదు, ఇక ముందు ఇస్తారేమో. నోబెల్ శాంతి బహుమానం ఇదివరకే మన నెహ్రూకు వచ్చి ఉండవలిసింది.

3. ఎస్. నాగేశ్వరరావు, రాజమండ్రి

ఇదివరకు "చందమామ" ["జ్వాలాద్వీపం"లో] ఉగ్రాక్షుడి గుహకు వచ్చుచున్న చిత్రసేనుడూ, అతని అనుచరులూ ఉగ్రాక్షుడి కాలిగోరంత ఉంటిరిగదా, ఇప్పుడు ఉగ్రాక్షుడితో సమానముగా ఉంటిరేమిటి?

ఉగ్రాక్షుడు రాక్షసుడు, కొత్తవాళ్ళకు ప్రమాదంగా కనిపిస్తాడు, మిత్రులయాక మామూలు మనిషిలాగా ఉంటాడు. కామరూపి గనక అలా కనిపించగలడు.

4. ఆ. అలవందార్, మదరాసు

"జ్వాలాద్వీపం" చదువుతుంటే మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది. అది ముగియు తేది ఎప్పుడండీ?

"జ్వాలాద్వీపం" 1961 జూన్ సంచికలో పూర్తి అవుతుంది.

5. కె. రాజేశ్వరి. నర్సీపట్నం

"చందమామ"లో బేతాళ కథలు ఇంకా ఎంతకాలం వేస్తారు?

బేతాళకథగా వెయ్యటానికి కథలు దొరికినంత కాలమూ వేస్తాము.

6. యన్. రమేశ్, పోతంగలు

["జ్వాలాద్వీపం"లో] చిత్రసేనుడికి ఉగ్రాక్షునికి చాలా స్నేహము. చిత్రసేనుడు మాట తప్పనివాడు. మరి ఉగ్రాక్షుని మోసము చేయుటకు కారణం?

ఎంత స్నేహమైతే మటుకు తన కొడుకును రాక్షసుడికివ్వాలంటే మనసు ఒప్పుతుందా? అదీగాక మోసం ఆలోచన చిత్రసేనుడి భార్యది. చిత్రసేనుడు అనుమోదకుడు మాత్రమే.

7. మునగవలస రంగారావు పట్నాయక్, వేణమ్మపేట

అన్నయ్యా! "చందమామ"లో ప్రచురణార్థం మేము పంపే కథలు, ప్రశ్నలు, ప్రతినెలా ఏ తేదీసరికి మీకు అందాలి?

"చందమామ" సంచికలు చాలా ముందుగానే తయారవుతాయి. అందుచేత మీరు తేదీలు పాటించ నవసరంలేదు.

8. "కే ఆర్కే", విశాఖపట్నం

ఫిబ్రవరి నెలనుండి అగస్టు నెలవరకూ "చందమామ"లు కావలెనన్నచో ఏమి చేయవలెను?

సర్క్యులేషన్ మేనేజరు, "చందమామ", మద్రాసు-26 చిరునామాకు రాయాలి.

9. ఏ. రామారావు, విజయనగరం

అన్నయ్యా! స్వాహలీ భాష ఏ దేశములో మాట్లాడెదరు?

ఆఫ్రికాలో.

10. వి. ఆర్. శేఖర్, చేబ్రోలు

నెలనెలా చెత్తబుట్టకు మీరిచ్చే బహుమతి ఏమిటి?

వేరే అడగాలా? ఉపయోగించలేని ప్రశ్నలూ, ఫోటోవ్యాఖ్యలూ, కథలూ, వగైరా వగైరా.

11. బి. ఎస్. వి. రత్నకుమారి, చీరాల

మార్కోపోలో మోటుపల్లిలో దర్శించిన రాణి రుద్రమదేవి చెల్లెలు గణపాంబా మహారాణి అని భావరాజు కృష్ణరావుగారు వ్రాసినారు. ఇంతకీ యిద్దరిలో ఏ రాణి పాలించినది?

రుద్రమదేవి.

# అట్టచివరి బొమ్మ

భారత యుద్ధంలో పదిహేనో రోజు ముగిసింది. ద్రోణుడుపోయాడు. కౌరవులు ఆ సాయంకాలం కుంగిపోయిన మనస్సులతో తమ శిబిరాలకు తిరిగి పోయారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారింది. కౌరవ యోధులంతా ఒకచోట కూడారు. కొత్త సేనానాయకుణ్ణి ఏర్పరచుకోవలిసి ఉంది. అశ్వత్థామ కర్ణుణ్ణి సూచించాడు. ఈ మాట దుర్యోధనుడికి ఎంతో నచ్చింది. అతను కర్ణుడితో, "మిత్రమా, భీష్మ ద్రోణులు పడిపోయారు. వారు అతిరథులే కాని వృద్ధులు, అర్జున పక్షపాతులు. నీవు వారికన్న శక్తిమంతుడవు, నా పట్ల పక్షపాతివి. అందుచేత నీవు నా బలాలకు సేనానాయకత్వం వహించి ఈ యుద్ధంలో నాకు విజయం చేకూర్చు," అని కోరాడు.

కర్ణుడికి శాస్త్రోక్తంగా అభిషేకం జరిగింది. సూర్యోదయంవేళకు అతని నాయకత్వం కింద కౌరవసేనలు యుద్ధానికి బయలుదేరాయి. అదే సమయానికి పాండవసేనలు కూడా వ్యూహంగా ఏర్పడి వచ్చాయి. పదహారో రోజు యుద్ధం ప్రారంభమయింది.

ధర్మరాజుతో యుద్ధంచేసి దుర్యోధనుడు పెద్ద దెబ్బతిన్నాడు. కర్ణుడు మంచి యుద్ధమే చేశాడు కాని అర్జునుడు అంతకుమించి యుద్ధం చేశాడు. ఆరోజు చీకటిపడి ఉభయపక్షాలవారు తమ శిబిరాలకు వెళ్ళేటప్పుడు పాండవులు ఉత్సాహంతో వెళ్లారు, కౌరవులు దెబ్బతిని వెళ్ళారు.

ఆ రాత్రి గడవగానే కర్ణుడు దుర్యోధనుడితో, "ఇవాళ నేను అర్జునుణ్ణి చంపటమో, లేక అతడి చేతిలో చావటమో జరిగితీరాలి. అతడికీ నాకూ గల తేడా చెబుతాను. శత్రుసంహారంలోనూ, అస్త్రలాఘవంలోనూ, దూరప్రసారం లోనూ నాకు అర్జునుడు చాలడు. బలపరాక్రమాలలోనూ, శౌర్యంలోనూ, లక్ష్యశుద్ధిలోనూ నాదే పై చెయ్యి. అతడికి గాండీవం ఉంటే నా వద్ద విజయమనే దివ్యమైన బాణం ఉన్నది. మూడువిషయాలలో మటుకు అర్జునుడు నన్ను మించుతాడు. అతడి వింటి నారి దివ్యమైనది, అతడికి అక్షయతూణీరాలున్నాయి, కృష్ణుడివంటి అశ్వహృదయం తెలిసిన సారథి ఉన్నాడు. మన పక్షాన అలా అశ్వ హృదయం తెలిసినవాడు శల్యుడొకడే ఉన్నాడు. అతను నాకు సారథ్యం చేసే పక్షంలో నేను అర్జునుణ్ణి ఇవాళ తప్పక చంపుతాను," అన్నాడు.

# కోల్గేట్‌తో నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే

కోల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును

కోల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కోల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనం ఫలితగాము నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కోల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేనతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కోల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె దాని పేషు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి!




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కోల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలలు వస్తుంది

కోల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✓ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✓ దంతక్షయమును నిరోధించును
- ✓ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




DCCo.31-TEL

నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కోల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు





# బుద్ధగయ

గయకు ఏడుమైళ్ళ దూరాన బుద్ధగయ ఉన్నది. ఇది బౌద్ధులకు గొప్ప పుణ్యక్షేత్రం. ఎందుకంటే, సిద్ధార్థుడు ఈ స్థలంలోనే ఒక బోధివృక్షం (రావిచెట్టు) కింద కూచుని ధ్యాననిష్ఠలో బుద్ధత్వం సంపాదించాడు. అందుచేత ఇది గొప్ప యాత్రాస్థలమయింది.

అశోకచక్రవర్తి (క్రీ. పూ. 3వ శతాబ్దంలో) ఇక్కడ ఒక దేవాలయం కట్టించాడు. ఆ ఆలయం ఇప్పుడు లేదు. ఇప్పుడున్న ఆలయం 11 వ శతాబ్దంలో పునర్నిర్మించినది. దీని అడుగున అశోకుడు నిర్మించిన ఆలయంతాలూకు పునాదులున్నట్టు తెలుస్తున్నది. ఇప్పుడున్న ఆలయం ఎత్తు 170 అడుగులు.

ఆలయం చుట్టూ రాతి అలవ ఉన్నది. ఇందులో ఒకభాగం క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దంనాటిది. ధ్యాననిమగ్నుడైన బుద్ధుడు కూర్చుండిన చోట ఒకప్పుడు వజ్రాసనం ఉండేది. అది ఇప్పుడు లేదు. ఇప్పుడున్న వజ్రాసనం దరిమిలా ఏర్పాటుచేసినది.

ఇప్పుడుకూడా ఇక్కడ ఒక బోధివృక్షం ఉన్నది. ఇది బుద్ధుడునాటి రావిచెట్టు సంతతికి చెందినదేనట.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1961 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పైననిలబడి చూసేదంత

రెండవ ఫోటో : పొట్టకూటికై చేసే వింత

పంపినవారు : యస్. బాషుమియ,

ఖడక్‌పుడ వీధి, కర్నూలు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# లచ్చుమ్మడు - ఎంకి

పూర్వం ఒక గొల్ల తరుణుడు – మన్మథుణ్ణి మించి ఉన్నాడు, పేరు లచ్చుమ్మడు. కోమలాంగి ఎంకి నిచ్చి లచ్చుమ్మడుకి పెళ్లి నిశ్చయించారు. ఓనాడు ఈ నవ దంపతులు ఆనందంగా అడవులమ్మట తిరుగుతూంటే ఉన్నట్టుండి ఎంకి చిలుకగా మారి తుఱ్ఱుమంది. లచ్చుమ్మడు చకితుడైపోయాడు. పరుగెత్తి పట్టుకుందామంటే కాలు కదలటంలేదు. ఇంతలో ఓ ముసలి యక్షిణి ముఖమంతా ముడతలతో పాలిపోయి ఉంది. రెప్ప వాల్చకుండా చూస్తూంది. బోసినోటితో ముక్కు మొఖం కలుసుకుపోయినాయి. మంత్రం జపిస్తూ చిలుకను పట్టుకొని మెల్లిగా జారిపోయింది.

ఏదైనా సంతోషపెట్టగల బహుమానం యక్షిణికిస్తే తన ఎంకి తనకొస్తుందని కలగన్నాడు ఒక రాత్రి లచ్చుమ్మడు. కాని ముసలిదాన్ని సంతోషపెట్టడం కష్టసాధ్యమని నిరాశతో నిరీక్షిస్తున్నాడు. ఆ మూలనుంచి ఈ మూలకు దేశమంతా వెతికి చివరకు ముసలిదాన్ని సంతోషపెట్టగల వస్తువుని సంగ్రహించుకొని వస్తున్నాడు. ముసలిది ఎదురై వెటకారంగా ఏక ఏక నవ్వి "లాభంలేదు!" అంది. లోకంలో ఏమిచ్చినాసరే వాడి ఎంకి వాడిది కాదు.

తెచ్చిన బహుమానం విప్పాడు లచ్చుమ్మడు. ముసలిదాని కళ్లు జిగేలుమన్నాయి. మనస్సు మారింది. ఎవ్వరొదులుకుంటారు? అందమైన ప్యారీ బిళ్లల డబ్బా. సంతోషంతో ఒక్క ఎంకినే కాదు మిగిలిన 7 వందల చిలుకలనూ అందమైన పిల్లలుగా మార్చింది.




నీతి:

**Parry's ప్యారీవారి బిళ్లలతో చేయుగల అద్భుతాలకు అంతంలేదు**



ప్యారీవారి బిళ్లలు ఎంతో రుచికరమైనవి, శుభ్రమైనవి, పుష్టికరమైనవి. విడిగాగాని ఫ్యాన్సీ డబ్బాలలోగాని కొనుక్కోవచ్చు.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకుంటూ, 'టైగర్'కు కొన్ని బిస్కట్లు పడవేశారు. 'టైగర్' వాటిని తంటూవుండగా, అటుగా వచ్చిన కొంటె కుర్రాడొకడు తన కుక్కను 'టైగర్' మీదికి ఉసికొల్పాడు. పెద్దకుక్క మొరుగుతూ మీదికి రావటం చూసి, 'టైగర్' దూరంగా పరిగెత్తింది. కాని, ఇంతలో చెట్టుమీద వున్న రాబందు ఒకటి, బిస్కట్లను చూసి, కిందికి వాలుతూ వాటిని సమీపిస్తున్న కొంటెకుర్రాడి కుక్కను, ముక్కుతో బలంగా పొడిచి, కాళ్లతో రెక్కలతో గట్టిగా ఒక బాదు బాదింది. దెబ్బ తిని కుయ్యోమంటూ పారిపోయే తన కుక్క వెంట, లబోమంటూ కొంటె కుర్రాడు పరిగెత్తాడు. దాసూ వాసూలు నవ్వుకున్నారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# జనవరి 26 విడుదల!

ఆర్. ఆర్. పిక్చర్స్ వారి

# ఇంటికి దీపం ఇల్లాలె



తారాగణం:

ఎన్. టి. రామారావు
జగ్గయ్య
రేలంగి
నాగయ్య
రమణారెడ్డి
బి. సరోజాదేవి
ఇ. వి. సరోజ
కన్నాంబ
గిరిజ

కథ, పాటలు, మాటలు:
ఆచార్య ఆత్రేయ

★

దర్శకత్వం, ఫోటోగ్రఫి:
వి. యస్. రెడ్డి

★

మ్యూజిక్:
విశ్వనాథం
రామమూర్తి

డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర & సీడెడ్: విజయా పిక్చర్స్, విజయవాడ.
నైజాం: విజయా డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్.
మైసూరు: విజయా పిక్చర్స్ సర్క్యూట్, బెంగళూరు.

# Books for the Family entertainment

| | | |
|---|---|---|
| Thandri Kodukulu<br>*(in Telugu & Tamil)* | 34 pages | Rs. 0.50 a copy |
| Aidu Prashnalu<br>*(in Telugu, Tamil & Kannada)* | 44 ,, | Rs. 0.37 ,, |
| Jathaka Kathalu<br>*(in Telugu & Kannada)* | 86 ,, | Rs. 0.75 ,, |
| Vichitra Kavalalu<br>*(in Telugu, Kannada, Hindi, Marathi, Tamil & Oriya)* | 116 ,, | Rs. 1.00 ,, |



*Stories serialised in 'Chandamama' issued in attractive book forms...*



**OBTAIN YOUR LANGUAGE COPY FROM YOUR LOCAL AGENT OR WRITE TO US**



*Book Dept.*

**CHANDAMAMA PUBLICATIONS**

**MADRAS-26**

Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

పొట్టకూటికై చేసే వింత

పంపినవారు :
యస్. బాఘమియ - కర్నూలు

